శ్రీమతే రామానుజాయ నమః.

శ్రీమద్యామునాచార్యకృత

# స్తోత్రరత్నము

శ్రీమాన్ వైయాకరణ రామానుజయ్య
గారిచే విరచిత
ఆంధ్రటీకాతాత్పర్యసహితము.







చెన్నపురి:
రావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే
ప్రకటితము.
1935.

శ్రీమద్యామునమునయే నమః.

# ఉపోద్ఘాతము.



ఈస్తోత్రగ్రంథమును లోకమునకు కృపచేసినవారు శ్రీఆళవందార్లు. గీర్వాణభాషయందు వీరి నామధేయము శ్రీయామునాచార్యులు. శ్రీవైష్ణవసంప్రదాయమందు గురుపరంపరలో మొదటివారగు శ్రీమన్నాథమునులకు వీరు పౌత్రులు. వీరి వైభవమును ప్రపన్నామృతము, దివ్యసూరిచరిత్రము, గురుపరంపరాప్రభావము మొదలగు ప్రబంధములయందు పూర్వాచార్యులు విశేషముగా వ్రాసియున్నారు. సూర్యోదయాత్పూర్వము అరుణోదయమైనట్టి శ్రీరామానుజులవారికి పూర్వము వీరు అవతరించినవారై శ్రీవైష్ణవసంప్రదాయానుసారముగ ప్రథమస్తోత్రగ్రంథమును వ్రాసిరి.

"స్వాదయన్నిహ సర్వేషాం త్రయ్యన్తార్థం సుదుర్గ్రహమ్."

అనునట్లు అత్యంత దురవగాహామైన వేదాంతార్థములను సమస్తమైనవారికి మనోహరముగాను సుబోధముగాను నుండునట్లు వ్రాసియున్నారు. ఎల్లవారు అవశ్యము తెలుసుకొనవలసిన "అర్థపంచకమును" ఈగ్రంథమందు విశదముగా శ్రీయామునాచార్యులు తెలిపియున్నారు.

భగవద్రామానుజాచార్యులు ప్రతిదినము బ్రాహ్మముహూర్తమందు లేచి తమ యంతరంగ శిష్యులతోఁ గూడి ఈగ్రంథము ననుసంధించుచుండినట్లుగా వారి దినచర్యయందు పూర్వాచార్యులు వ్రాసియున్నారు.

"బ్రాహ్మే ముహూర్తే చోత్థాయ
ధ్యాత్వా గురుపరంపరాం,
ధ్యాయన్తం కూరనాథాద్యైః
సేవ్యమానం గురూత్తమైః.
చతుశ్శ్లోకీం స్తోత్రరత్నం
సార్థం యామునకర్తృకం,
అనుసందధతం సమ్యక్
ఆశ్రయే యతిశేఖరమ్."

ఈగ్రంథమును "కుట్టిభాష్య" మనియు, అనగా

రామానుజాచార్యులవారి శ్రీభాష్యమునకు సంగ్రహమనియు, నాలాయిర దివ్యప్రబంధార్థములకును సంక్షేపమనియు పూర్వాచార్యులు వ్రాసియున్నారు.

ఈగ్రంథమునకు ఆంధ్రమందు ప్రథమవ్యాఖ్యానమును వ్రాసినవారు కీర్తిశేషులైన శ్రీమాన్ వైయాకరణ రామానుజయ్యగారు. వీరు గీర్వాణభాషయందును, నాలాయిరప్రబంధములయందును పూర్ణపాండిత్యము గలవారగుటవలన శ్రీవైష్ణవ సంప్రదాయరీతిగా జ్ఞాతవ్య సకలాంశములను ఆంధ్రవ్యాఖ్యానమందు విశదముగా తెలిపియున్నారు. వీరు క్రోధినామ సంవత్సరం చిత్రినెల ధనిష్ఠానక్షత్రమందు, అనగా క్రీస్తుశకము 1844 సం॥ మే మాసమందు అవతరించిరి. వీరి తండ్రిగారు శ్రీశైలనాథులు. వీరు శ్రీవైష్ణవగ్రంథములయం దఖండపాండిత్యము గలవారై శ్రీవైష్ణవ దివ్యదేశములయందు గౌరవింపబడుచు ప్రపన్నజనశిష్యబృందములతో విరాజమానులుగా నుండిరి. రామానుజయ్యగారు బాల్యమందే తమ తండ్రిగారిసన్నిధిన సవ్యాఖ్యాన నాలాయిరప్రబంధాధ్యయనాదులను పూర్తిచేసిరి.

పిమ్మట మదరాసు ప్రెసిడెన్సి కాలేజిలో సంస్కృత పండితులుగా నుండిన శ్రీమాన్ ఉభయ వేదాంతప్రవర్తక సుదర్శనాచార్యులవారి సన్నిధిన సవ్యాఖ్యాన సిద్ధాంతకౌముదీ వ్యాకరణశాస్త్రమును అధ్యయనము చేసిరి. ఇట్లుండఁగా సుమారు 1866 సం॥ హిందూ భూస్వాములబిడ్డలకు ప్రత్యేకముగా ఒక పాఠశాల "హిందూ ప్రొప్రైటరి హైస్కూల్" అను నామముతో చెన్నపట్టణమందు స్థాపింపఁబడినది. ఈపాఠశాలకు గీర్వాణ ప్రధానోపాధ్యాయులు కావలసియుండి పండిత పరీక్ష ఒకటి జరుపఁబడెను. తత్కాలమున 135 మంది పండితులా పరీక్షకు హాజరైరి. అందు రామానుజయ్యగారు ప్రథములుగా నుత్తీర్ణులయినందున సంస్కృత ప్రధానోపాధ్యాయులుగా నియమింపఁబడిరి. వీరు శ్రీవైష్ణవసిద్ధాంతమునకు ప్రధానమైన రెండు గొప్ప ప్రబంధములను పరిశీలనచేసి ముద్రింపించిరి. ఆగ్రంథములను పూర్వాచార్యులు మణిప్రవాళశైలి ననగా సంస్కృత మిశ్రితద్రవిడభాషయందు వ్రాసియుండిరి. వానిలో మొదటిది "శ్రీవచనభూషణము." ఈగ్రంథము

"సాంగాఖిలద్రవిడసంస్కృతవేదరూప,
సారార్థసంగ్రహమహారసవాక్యజాతమ్."

అనునట్లు సకలశాస్త్రసారార్థ ప్రతిపాదకమైనది. లోకోపకారకమైన యీ ప్రబంధమును వీరు పురాతన తాళపత్రగ్రంథములను పరిశీలించి వ్యాఖ్యానద్వయముతో 1875 సం|| అచ్చు వేయించిరి. వీరు పరిశీలనచేసిన మరియొక మహాప్రబంధము "శ్రీవైష్ణవ సమయాచారనిష్కర్ష" మనునది. ఈగ్రంథము శ్రీవైష్ణవసిద్ధాంత పూర్వాచార్యపరంపరాగతసత్సంప్రదాయ ప్రతిపాదకము.ఏతత్సిద్ధాంత నిష్ఠాగరిష్ఠులై "అప్పా అండు కంపెని" ప్రొప్రైటరుగానుండి కీర్తిశేషులైన శ్రీమాన్ తిమ్మప్పభాష్యంనాయఁడుగారిని ఈప్రబంధమును అచ్చొత్తింపవలయునని పెక్కురు శ్రీవైష్ణవులు ప్రార్థించుచుండిరి. అందుపైని వారు బహువ్యయప్రయాసలతో తాళపత్రగ్రంథములను సిద్ధపఱిచిరి. పైవారికి శ్రీమాన్ రామానుజయ్యగారు సహాయభూతులయి చదువరులకు విశదముగా నుండునట్లు విషయసూచికలు మొదలగు వానితో 1909 సం|| ముద్రింపించిరి. వీరు జ్ఞానాను

ష్ఠానసంపన్నులై శిష్యబృందమునకు తమ తత్త్వోప దేశముచేత ఆనందావహులై లోకులచేత సన్మార్గ ప్రవర్తకులనియు పండితోత్తములనియు అభినం దింపఁబడుచుండి నళనామ సం॥ పుష్యమాసమందు (1917 సం॥ ఫిబ్రవరి) స్వాచార్యపాదారవిందములు చేరిరి. "బహుశ్రుతానాం వృద్ధానాం బ్రాహ్మణానా ముపాసితా" యనునట్లు బాల్యముమొదలు పెద్దల సన్నిధిని తత్త్వహితపురుషార్థములను వినుటవలన శ్రీవైష్ణవసిద్ధాంతమందు మిక్కిలి రుచివిశ్వాసములు గలవారును మదరాసు హైకోర్టు అడ్వొకేటుగారు నైన శ్రీమాన్ వేంకటస్వామినాయఁడుగారీస్తోత్ర గ్రంథమును బునర్ముద్రితము గావించునభిప్రాయము గలవారై తమకు ఆప్తులైన బ్రహ్మశ్రీ భాషోద్ధారక వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారితోఁ బ్రస్తావిం చిరి. ఈసదుద్దేశమును వారు ఆమోదించి, పండితా గ్రేసరులై భరతఖండమునందు సంస్కృతాంధ్రవా జ్మయోద్ధరణనిర్వాహకాగ్రగణ్యులై కీర్తిశేషులైన బ్రహ్మశ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులగారి ముద్రా క్షరశాలయందు ప్రకటించిరి. ఇందులకై బ్రహ్మశ్రీ

వేంకటేశ్వరశాస్త్రులగారికిని శ్రీమాన్ వేంకటస్వామి నాయఁడుగారికిని సవినయముగఁ గృతజ్ఞతాపూర్వక వందనములు దెలుపుకొనుచున్నాఁడను.

ఇట్లు,

శ్రీమాన్ వైయాకరణరామానుజయ్యగారి

పుత్త్రుఁడు శ్రీశైలనాథుఁడు.

శ్రీమద్యామునమునయే నమః.

# పీఠిక.



శ్రీశైలేశితృదేశికేంద్రకరుణా
సూర్యప్రకాశేముహుః
శ్రీమద్యామునదేశికేంద్రవచనా
నర్ఘార్థరత్నోత్కరా౯,
దర్శం దర్శమతంద్రితో నతిలఘు
స్పష్టం నవంచాంధ్రతో
వ్యాచక్షేస్ఖలితానికానిచిదిహ
స్యుశ్చేత్క్షమధ్వంబుధాః.

సంత్యేవాన్యయుగేష్వపి క్షితితలే
సూయాభరాదుర్భగాః
కావార్త్తాఽత్రకలౌ యుగే పునరత
స్తైః కింపురోభాగిభిః,

యే వా కేపి మనస్వినః పరగుణై
రేవోత్సుకాస్సన్తిచే
త్తేషామేషమమోద్యమో బహుతరం
స్యా దేవహర్షావహః. ౨

పరమకారుణికుండగు శ్రీమన్నారాయణుండు అనాదికర్మజనితరుచివాసనా సముపచితాజ్ఞానత్రయ హేయభూయిష్ఠాన వధికామితక్లేశపరంపరానివేశ సంసార నిబద్ధులగు బద్ధుల నుద్ధరింపనొనర్చిన నసంఖ్యాతావతారములు కరణకళేబర శాస్త్రప్రదానాదులతోటిపాటు కించిత్కరములుగాఁగా సజాతీయులగు తదీయులమూలముగా వారల నుజ్జీవింపఁ జేయ నిశ్చయించి శ్రీమదనంతగరుడవిష్వక్సేనాదుల శ్రీపరాంకుశ పరకాలయతివరాదులనుగా నవతరింపఁజేయునపుడు శ్రీవిష్వక్సేన ముఖ్యభటచతుష్టయాన్యతమ హరివదనాంశముచేఁ గలియుగంబున ౪౦౧౭ వది యగు ధాతునామసంవత్సరంబున నాషాఢపూర్ణిమా బుధవాసరసహితోత్తరాషాఢా నక్షత్రమందు శ్రీమన్నాథమునుల కుమారులగు నీశ్వరమునులకుఁ గుమారులుగానవతరించి "యము

నత్తుఱైవర్" అను తిరునామముగల శ్రీయామునాచార్యులవారు సకలవిద్యాపారంగతులై సకలకలావిదగ్ధవిద్వజ్జన కోలాహల విజయశుల్క సమధిగతార్ధ రాజ్యమును తద్దేశాధిపమహిషీలలామ ప్రహర్ష వితీర్ణమగు "ఆళవందార్"అను తిరునామముతోఁ బరిపాలింపుచు మహోన్నత దశలోనుండునపుడు శ్రీమణక్కాల్ నంబిగారి మూలముగా సకలసంప్రదాయార్థములు లభించి తదనుగ్రహమువలన చిదచిత్ప్రాప్య ప్రాపకా భాసములందు విరక్తిమించి సన్యాసాశ్రమంబు నవలంబించి ప్రపన్నజనాగ్రగణ్యులై కోవెలయందు నిత్యవాసముఁ జేయుచు దర్శనోద్ధారకులై తత్త్వహితపురుషార్ధ యాథాత్మ్యోపదేశద్వారా బహుచేతనుల నుజ్జీవింపఁ జేయుచుండు కాలమున చేతనుల మందమతిత్వమును వేదాంతార్థదురూహత్వ చిరకాల సాధ్యత్వ విఘ్నప్రాయికత్వాధికృతాధికారత్వాదుల నాలోచించి సంస్కృతద్రావిడరూప సర్వోపనిషద్రహస్య సకలసారతమార్థవిశేషముల సమస్తచేతనులు సులభముగాఁ దెలిసికొని యుజ్జీవించునటుల స్తోత్రరత్న మను నామముతోఁ గృపఁజేసిన నీగ్రంథమందు

ప్రథమమున ౫ శ్లోకములచే భగవద్విషయ ప్రవృత్తికిఁ దమ్ము యోగ్యులనుగా నొనర్చిన నాచార్యుల యం దుపకారస్మృతిచే శరణాగతి నొనర్చి వెనుకటి శ్లోకములచే భగవద్విషయమందవగాహించి స్తోత్రాక్షేప సమాధానములఁ జేసి నావేక్షసే మొదలు త్వదాశ్రితానాంవరకు శరణ్యప్రభావమును సహస్రముఖములుగా ననుసంధించి అనంతరశ్లోకముచే భగవత్ప్రభావమున కోడి వాని శ్రీపాదములఁ జేరి నధర్మనిష్ఠోస్మి మొదలు తవామృతస్యందిని వరకు శరణాగతి నొనర్చి శరణాగతసంభావిత స్వభావముల సాయించి త్వదంఘ్రి మొదలు ౨ శ్లోకములఁ గరణత్రయముచే శరణాగతినిమిత్తము లేకయేకైకకరణశరణాగతియే ఫలసిద్ధినిఁ గలుగఁజేయుటను సాయించి విలాసవిక్రాంత మొదలు భవన్తమేవ పర్యంతము పురుషార్థము నపేక్షించి ప్రార్థించునపుడే లభింపనందున నిత్యసూరిభోగ్యమగు విషయమును నిత్యసంసారియగు నే నపేక్షించుటఁ దగదని తమ్ము నిందించుకొని మఱియును దమకు నాప్రాప్యమందుం డభిలాషాతిశయముచే నయోగ్యతా పాదకములగు పాపముల నిర్హేతుకకృపచే నశింపఁ జేయవలయు

నని తాము చేసియుండు ప్రపత్తిని స్మరింపఁజేసి అవి వేక మొదలు 3 శ్లోకములచే దేవరవారికి నుపయు క్తులుకానివారు నున్నారాయని పై ౨ శ్లోకములచే స్వస్వరూపయాథాత్మ్యమును పరభక్తియు నపే క్షించి వెనుక ౨ శ్లోకములచే పురుషార్థ సీమా భూమియగు తదీయశేషత్వమును బ్రార్థించి మీఁదు ౨ శ్లోకములచే నిట్లిచ్ఛయించు నే నశుభాస్పదుఁడై యున్న నిచ్ఛానుకరణమాత్రము నే మహాత్ముఁగా దలఁచు దేవరవారు గృపచే నశుభముల నివర్తింపఁ జేసి యభిలాషాతిశయమును గలుగఁజేసి నిరు పాధిక సంబంధముచే సర్వవిధముల భరింపఁదగి యున్నానని సాయించి అవశిష్టముచే సర్వవిధములఁ గృపైకనిర్వాహ్యుఁడగు దాసుఁడొనర్చిన ప్రపత్తిని ననాదరించినను ప్రపన్నజనవిషయముగా దేవరవా రొనర్చియుండు ప్రతిజ్ఞననాదరించినను శ్రీమన్నాథ మునులందు దేవరవారికినుండనురాగాతిశయ మపరి హార్యము గనుక దేహాసంబంధాత్మసంబంధములచే నా శ్రీమన్నాథమునులకు మనుమఁడై యుండుటఁ గటాక్షించి దాసుని పాపముల క్షమావిషయముఁ జేసికొని సద్వృత్తిదుర్వృత్తుల నవలోకింపక రక్షించి

కృపఁజేయవలయునని ప్రార్థించిన నాప్రకార మీశ్వరుఁడనుగ్రహించిన నభిమతమును లభించి కృతార్థుడై మహానందంబుతో స్తోత్రమును ముగించుచున్నాను.



    

శ్రీః

శ్రీమతే రామానుజాయ నమః.

# శ్రీ యాళవందారుస్తోత్రము

ఆంధ్రటీకాతాత్పర్యసహితము.



అవతారిక. శ్రీమన్నారాయణస్వరూపరూపగుణవిభూత్యైశ్వర్యములను సమస్తచేతనులు దెలిసికొని యుజ్జీవించునట్లుగా స్తోత్రరూపముగా సాయించిన శ్రీయాళవందారులను వారి సంబంధు లుపకారస్మృతిచే సేవించుచున్నారు:—

శ్లోకము. స్వాదయన్నిహ సర్వేషాం.
త్రయ్యన్తార్థం సుదుర్గ్రహమ్,
స్తోత్రయామాస యోగీన్ద్ర
స్తం వన్దే యామునాహ్వయమ్. ౧

టీక. యః=ఏ, యోగీన్ద్రః = యోగిశ్రేష్ఠులు, సుదుర్గ్రహం=గ్రహింపశక్యముగాని, త్రయ్యన్తార్థం=వేదాన్తార్థమును, ఇహ=ఈలీలావిభూతియందు, సర్వేషాం = సమస్తచేతనులకు, స్వాదయన్=మధురముగాఁజేయుచు, స్తోత్రయామాస=స్తోత్రము

జేసిరో, యామునాహ్వయం = యామునాచార్యు లనునామ ధేయముగల, తం=ఆయోగీంద్రులను, వన్దే=సేవించుచున్నాను.

తాత్పర్యము. క్లేశబాహుళ్యముగలవై బుద్ధి చాంచల్యకారణములై విఘ్నోపహతములై అధికృతాధికారంబులై దురవగాహంబులైన వేదాంతము లందుఁ బ్రతిపాద్యమైన శ్రియఃపతి రూపపరతత్వార్థమును సమస్తచేతనులు సులభముగాఁ దెలిసికొని యుజ్జీవించునట్లు కృపఁజేసినవారై నిరవధిక వాత్సల్యకృపాపరిపూర్ణులగు శ్రీయాళవందారులను సేవించుచున్నాను.

అవ. తాము భగవంతుని స్తోత్రముఁజేయనారంభించి యాభగవత్కల్యాణగుణవిభూతులను దమకు విశదతమముగా సాక్షాత్కరించునటులఁ బరిపూర్ణకటాక్షముజేసి సర్వవిధోత్తారకులైన శ్రీమన్నాథమునులను మూఁడుశ్లోకములచే సేవించుచున్నారు:—

శ్లో. నమోఽచిన్త్యాద్భుతాక్లిష్ట
జ్ఞాన వైరాగ్యరాశయే,
నాథాయ మునయేఽగాధ
భగవద్భక్తిసిన్ధవే. ౨

టీ. అచిన్త్యాద్భుతాక్లిష్టజ్ఞానవైరాగ్యరాశయే-అచిన్త్య= పరిచ్ఛేదింపఁగూడనివై, అద్భుత = ఆశ్చర్యమైనవై, అక్లిష్ట = సుఖరూపమైన, జ్ఞాన=జ్ఞానముయొక్క, వైరాగ్య=ఇతరవిషయ

విరక్తియొక్క, రాశయే=సమూహముగలవారును, మునయే = భగవదేకధ్యానశీలురును, అగాధభగవద్భక్తిసిన్ధవే - అగాధ = మిక్కిలి లోతైన, *భగవత్ =పరమపదనివాసుఁడైన వాసుదేవుని యందలి, భక్తి = అనురాగరసమునకు, సిన్ధవే = సముద్రులైన, నాథాయ=శ్రీమన్నాథమునులకొఱకు, నమః= సేవించెదను.

తా. స్వయత్నసాధ్యమగుటవలన దుఃఖరూపమై పరిచ్ఛిన్నమైన వ్యాసాదులజ్ఞానమువలెఁగాక నిర్హేతుకభగవత్ప్రసాదలబ్ధమగుటచే సుఖరూపములై యపరిచ్ఛిన్నములైన జ్ఞానవైరాగ్యములుగలవారును భగవత్కల్యాణగుణైకభోగ్యులై జలములకు సముద్రమువలె భగవద్భక్తికి స్థానభూతులైన శ్రీమన్నాథమునులకొఱకు సేవించెదను.

అవ. ప్రథమశ్లోకమందు శ్రీమన్నాథమునులయొక్క పరత్వవిషయమైన జ్ఞానాదులను సాయించి యీశ్లోకమందు మధుజిత్తనుటచే నవతారవిషయికజ్ఞానభక్తులను గొనియాడుచున్నారు:—

---

* జ్ఞానబలైశ్వర్యవీర్యశక్తితేజస్సు లనునివి షడ్గుణములు. జ్ఞానము సమస్తవస్తు సాక్షాత్కారము. బలమఘటితఘటనా సామర్థ్యము. ఐశ్వర్యము సమస్తలోకములఁ దనసొత్తుగాఁజేసికొనుట. వీర్యము సమస్తలోకభరణమందును శ్రమలేమి. శక్తి సృష్ట్యాది సామర్థ్యము. తేజస్సు శత్రువులను దిరస్కరించు సామర్థ్యము. ఈయాఱుగుణములు గలవాఁడు భగవన్తుఁడు.

శ్లో. తస్మై నమో మధుజిదఙ్ఘ్రి సరోజతత్త్వ
జ్ఞానానురాగ మహిమాతిశయాన్త సీమ్నే,
నాథాయనాథమునయేఽత్ర పరత్ర చాపి
నిత్యం యదీయచరణౌ శరణం మదీయమ్. 3

టీ. అత్ర=లీలావిభూతియందు, పరత్ర చాపి=పరమపద మందును, నిత్యం=ఎల్లప్పుడు, యదీయచరణౌ - యదీయ=ఏ నాథమునుల సంబంధియైన, చరణౌ=శ్రీపాదములు, మదీయం= నాసంబంధియైన, శరణం=రక్షకమో, మధుజిదఙ్ఘ్రిసరోజతత్త్వ జ్ఞానానురాగ మహిమాతిశయాన్తసీమ్నే - మధుజిత్=విరోధిని వర్తకుఁడైన స్వామియొక్క, అఙ్ఘ్రిసరోజ = తామరపుష్పముల వంటి తిరువడిగళునందు, తత్త్వ=యథార్థమైన, జ్ఞాన=జ్ఞానము యొక్క, అనురాగ=భక్తియొక్క, అన్తసీమ్నే = సీమాభూమి యైన వారును, నాథాయ = స్వామియైన, తస్మై=ఆ, నాథము నయే=శ్రీమన్నాథమునులకొఱకు, నమః=సేవించెదను.

తా. ఆశ్రితవాత్సల్యముచేత వారిప్రతిబంధ నివృత్తికొఱకు పరిగ్రహించిన * రామకృష్ణాద్యవ తారములందుఁ దత్కృతాతిమానుష చేష్టలయందు నతిమాత్రమైన జ్ఞానభక్తులు గల శ్రీమన్నాథ మునులయొక్క తిరువడిగళే లీలావిభూతియందు నిత్యవిభూతియందును నాకు ప్రాప్యప్రాపకములు.

---

* "జన్మకర్మచమేదివ్య మేవం యోవేత్తితత్త్వతః, త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతిసోఽర్జున." అని గీతావచనము.

అవ. తాపార్తునికి శీతోదకమును బుచ్చుకొనఁ బుచ్చుకొనఁ దృప్తిఁగలగనట్టువలె శ్రీమన్నాథమునుల యుపకృతినిఁ దలఁచి తలఁచి యాదరమెచ్చి వారికే దాసభూతుఁడ నని పెక్కుమాఱులు సేవించుచున్నారు:—

శ్లో. భూయోనమోఽపరిమితాచ్యుతభక్తితత్త్వ
జ్ఞానామృతాబ్ధి పరివాహ శుభైర్వచోభిః,
లోకేఽవతీర్ణపరమార్థసమగ్రభక్తి
యోగాయనాథమునయే*యమినాంవరాయ. ౪

టీ. అపరిమితాచ్యుత భక్తితత్త్వజ్ఞానామృతాబ్ధి పరివాహశుభైః - అపరిమిత=నిరవధికమైన, అచ్యుత=ఆశ్రితవాత్సల్యముగల విష్ణువుయొక్క, భక్తి=అనురాగము, తత్త్వజ్ఞాన=యథార్థమైన జ్ఞానమనియెడు, అమృతాబ్ధి = క్షీరసాగరముయొక్క, పరివాహ=ప్రవాహములవలె, శుభైః=భోగ్యములైన, వచోభిః=సూక్తులచేత, లోకే = లీలావిభూతియందు, అవతీర్ణపరమార్థ

*యమినాంవరాయ యని సాయించుటచే "తతఃకాలే నమహతా వినష్టాం భగవత్కృతిం,నాథనామామునివరో యోగజ్ఞానాదవాప్స్యతి."ఆళ్వార్లు కృపఁజేసిన ద్రవిడవేదము గొంత కాలమునకుఁ బ్రమోషితముకాఁగా నాథమును లనుయోగీంద్రులొక రవతరించి యాద్రవిడవేదము నుద్ధరింపఁబోవుచున్నారనే వృద్ధపారాశర్యమందలి నాథమునుల వైభవమును సూచింపఁజేసిరి.

సమగ్రభక్తియోగాయ-అవతీర్ణ=అవతరించిన, పరమార్థ=పరమ పురుషార్థమైన, సమగ్ర=సంపూర్ణమైన, భక్తియోగాయ=భక్తి యోగముగలవారును, యమినాం = భగవదేకశేషభూతులైన యోగులలో, పరాయ=అగ్రగణ్యులైన, నాథమునయే=శ్రీమన్నాథమునులకొఱకు, భూయః=మఱల, నమః=సేవించెద.

తా. భగద్విషయమం దపరిచ్ఛిన్నములైన జ్ఞానభక్తులనే క్షీరసముద్రముయొక్క ప్రవాహముల వలె సంసారాగ్నిసంతాపశామకములై భోగ్యములైన శ్రీసూక్తులచే నిరవధికవాత్సల్యమువలన సకలచేతనోజ్జీవనతత్పరులై యోగరహస్యము మొదలగువానినిఁ గృపజేసిన శ్రీమన్నాథమునులకొఱకు 'భూయోనమః, భూయోనమః' యని యనుసంధించెదను.

అవ. ఇట్లు శ్రీమన్నాథమునుల మహోపకారమును గొని యాడి సిద్ధాంతప్రవర్తకులై సమస్తచేతనులకుఁ దత్వత్రయజ్ఞానమును విశదతమముగాఁ గృపచేసిన శ్రీపరాశరభగవానుల సేవించుచున్నారు :—

శ్లో. తత్త్వేన య శ్చిదచిదీశ్వర తత్స్వభావ
భోగాపవర్గ తదుపాయ గతీరుదారః,
సన్దర్శయ న్నిరమిమీత పురాణరత్నం
తస్మై నమో మునివరాయ *పరాశరాయ. ౫

* పరాన్ శృణాతీతిపరాశరః=మాయావాదులను కుదు

టీ. ఉదారః = దానశీలురైన, యః=ఏ ఋషిశ్రేష్ఠులు, చిదచిదీశ్వరతత్స్వభావ భోగాపవర్గ తదుపాయగతీః - చిదచిదీశ్వర=చేతనాచేతనేశ్వరులను, తత్స్వభావ=వానిస్వభావములను, భోగ=శబ్దాదిభోగములను, అపవర్గ=పరమపురుషార్థమైన మోక్షమును, తదుపాయగతీః = భోగహేతువులైన కామ్యకర్మములను; మోక్షహేతువులైన కర్మజ్ఞానభక్తి ప్రపత్తులను, తత్త్వేన= యథార్థముగ, సన్దర్శయన్ = చూపించుచు, పురాణరత్నం = పురాణశ్రేష్ఠమును .విరమమీత = సర్వసులభముగా నిర్మించిరో, మునివరాయ=భగవదనుభవైకపరులలో నగ్రగణ్యులైన, తస్మై= ఆ,పరాశరాయ=పరాశర మహర్షులకొఱకు, నమః=సేవించెదను.

తా. హేయమై నశ్వరమైనదేహమందాత్మభ్రమగలవారై శిశ్నోదరాదిపోషణమునే పరమపురుషార్థముగాఁ దలఁచి తదనుకూలములైన హేయవ్యాపారములఁజేయుచు నశించుచున్న సాంసారికుల దుఃఖమును జూచి సహింపఁజాలక వారివలన నొక యుపకృతిన్ని లేమిని దలంపక చేతనులు తత్త్వత్రయజ్ఞానముగలవారై యుజ్జీవించుటే పరమప్రయోజనముగాఁ దలఁచి యాత్మజ్ఞానానందాదిగుణములు గలదై భగవదేకశేషమనియు, నచిత్తుజ్ఞానశూన్యమై భగవదిచ్ఛచేత బ్రహ్మాండాదిరూపముగాఁ బరిణ

---

ష్టులు మొదలైనవేదబాహ్యులను ప్రమాణములనే రంపములచే హింసించువారు.

మించియుండుననియు, నాచిదచిత్తులకు నాధారాధే యభూతుండైన శ్రీమన్నారాయణుండు సర్వస్వామి రుండై సమస్తకల్యాణగుణాత్మకుండైనవాండనియు, స్వర్గాదిభోగములను తత్సాధకములు కామ్యకర్మములన్నియ యాత్మానుభవ రూపకైవల్యమునున్ను తత్సాధకములు కర్మయోగాదులన్నియ పరమపురుషార్థలక్షణ మోక్షమునున్ను తదనుకూలమైనది భగవదేకోపాయోపేయత్వ రూపప్రపత్తి యోగమన్నియ సకలచేతనులకు విశదతమముగాం గృపం జేసిన యాప్తతములైన శ్రీపరాశరమహర్షులను సేవించుచున్నాను.

అవ. ఇట్లు పరాశరులను గొనియాడి పిమ్మట వారు గృపచేసిన యర్థములధికృతాధికారముగాక సర్వాధికారమగునట్లుగా ద్రావిడసంహితను భగవన్నిర్హేతుకకృపవలన సాక్షాత్కరించి నాథమునులకుం గృపచేసిన ప్రపన్నజనాగ్రేసరులైన నమ్మాళ్వారుల తిరువడిగళును దీడుపడుచున్నారు:—

శ్లో. మాతాపితాయువతయ స్తనయావిభూతి
స్సర్వంయదేవనియమేనమదన్వయానామ్,
ఆద్యస్యనఃకులపతేర్వకుళాభిరామం
శ్రీమత్తదఙ్ఘ్రియుగళంప్రణమామిమూర్ధ్నా.

టీ. మదన్వయానాం = నావంశమందుం బుట్టినవారికి, యదేవ = ఏనమ్మాళ్వారుల తిరువడిగళే, నియమేన = నియమ

ముగా, మాతా=తల్లి, పితా=తండ్రి, యువతయః=స్త్రీలు, తనయాః=పుత్రులు, విభూతిః = ఐశ్వర్యము, సర్వం=సమస్తమును, అభూత్ =ఆయెనో, ఆద్యస్య = ప్రథమాచార్యులును, నః= ప్రపన్నులైన మాయొక్క, కులపతేః =గోత్రర్షులైన నమ్మాళ్వారులయొక్క, వకుళాభిరామం - వకుళ = పొగడపువ్వులచేత, అభిరామం = మనోహరమైన, శ్రీమత్ =వైష్ణవశ్రీతోఁగూడిన, తత్ = ఆ, అఙ్ఘ్రియుగళం - అఙ్ఘ్రి = శ్రీపాదములయొక్క, యుగళం=ద్వయమును, మూర్ధ్నా = శిరస్సుచేత, ప్రణమామి= సేవించుచున్నాను.

తా. శ్రీమన్నాథమునులు శ్రీరామమిశ్రులు మొదలైనయాచార్యుల పరంపరయనే రాజవంశమందవతరించిన ప్రపన్నజనులకందఱికిఁ బ్రియపరులైన తల్లియు హితపరుఁడైనతండ్రియు భోగార్హలైన స్త్రీలును ఆనందోత్పాదకులైన కొమాళ్లును నిరవధికైశ్వర్యమును సమస్తభోగములునైనదై పొగడపువ్వులచే బరిమళించుచున్న ప్రపన్నగోత్రమునకు మూలపురుషులైన నమ్మాళ్వారులయొక్క తిరువడిగళునం దుపాయోపేయభావముతో కరణత్రయముచే సేవించుచున్నాను.

అవ. ఇట్లు నమ్మాళ్వారులయొక్క యుపాయోపేయభావమననుసంధించి వారిపరిపూర్ణానుగ్రహమువలనఁ దమయందతిమాత్రప్రేమతో నిత్యవాసముఁజేయుచున్న సర్వేశ్వరుని

వాత్సల్యాదిగుణములచే జయింపఁబడి యానందపరవశులై వా
చిక కైంకర్యమును జేయ నారంభించి వానితిరువడిగళును సేవిం
చుచున్నారు:—

శ్లో. యన్మూర్ధ్ని మే శ్రుతిశిరస్సుచభాతి యస్మి
న్నస్మన్మనోరథపథ స్సకలస్సమేతి,
స్తోష్యామినః కులధనం కులదైవతంత
త్పాదారవిన్ద మరవిన్ద విలోచనస్య. ౭

టీ. యత్=ఏ శ్రీపాదద్వయము, మే = నాయొక్క,
మూర్ధ్ని=శిరస్సునందు, శ్రుతిశిరస్సుచ = వేదాంతములందును,
భాతి=ప్రకాశించుచున్నదో, యస్మిన్ = ఏపాదద్వయమందు,
సకలః=సమస్తమైన, అస్మన్మనోరథపథః - అస్మత్=మాయొక్క,
మనోరథపథః=కోరికలను మార్గము, సమేతి = పొందుచున్నదో,
నః=మాకు, కులధనం=పితృపితామహ సమ్బన్ధిద్రవ్యమైనదియు,
కులదైవతం = కులదేవతయునైన, అరవిన్దవిలోచనస్య=తామర
పుష్పములవంటి నేత్రములుగల శ్రియఃపతియొక్క, తత్=
ఆ, పాదారవిన్దం = తామరపువ్వులవలె మృదువులై సున్దరము
లైన శ్రీపాదములను, స్తోష్యామి=స్తోత్రముఁజేసెదను.

తా. వేదాన్తములందువలె నత్యన్తనికృష్టుఁడైన
నాయందు నివాసము నభిలషించి తల్లాభమువలన
నత్యానందముచే నిరవధికతేజస్సంపన్నములై
వాత్సల్యసౌశీల్యాదులకు లోపడిన నస్మదాదులకుఁ
బరమభోగ్యములై మాయొక్క రాజవంశమునకు

నిక్షేపమై కులదేవతయునై ప్రాప్యప్రాపకములైన దేవరవారి శ్రీపాదములను స్తోత్రముఁజేసెదను.

అవ. ఇట్లు స్తోత్రముజేయ నారంభించి బ్రహ్మాదులకున్న పరిచ్ఛేద్యములై యవాఙ్మానసగోచరములైన భగవత్కల్యాణ గుణవిభూతులను పరిచ్ఛేదించి స్తోత్రముజేయ నుద్యోగించిన తమ్ము నిందించుకొనుచు యుద్ధసన్నద్ధుఁడైన యర్జునుఁడు "విససర్జశరఞ్చాప" మని యుద్ధమునభిలషింపక బాణమును వింటిని విడిచినట్టుగా నాకీప్రయత్నము తగదని సాయించుచున్నారు:-

శ్లో. తత్త్వేనయస్య మహిమార్ణవశీకరాణు
శ్శక్యోనమాతుమపిశర్వపితామహాద్యైః,
కర్తుంతదీయ మహిమస్తుతిముద్యతాయ
మహ్యంనమోఽస్తు కవయే నిరపత్రపాయ. ౧

టీ. యస్య=ఏ సర్వేశ్వరునియొక్క, మహిమార్ణవశీకరాణుః - మహిమ = ప్రభావమనియెడు, అర్ణవ=సముద్రముయొక్క, శీకర = తుంపురుయొక్క, అణుః=లేశము, శర్వపితామహాద్యైః - శర్వ=శివుఁడు, పితామహ = బ్రహ్మ, ఆద్యైః=మొదలైనవారిచేత, తత్త్వేన=యథార్థముగా, మాతుమపి=పరిచ్ఛేదించుటకేని, శక్యః=సమర్థము, న=కాదో, తదీయమహిమస్తుతిం-తదీయ=అట్టివాని సంబంధియైన, మహిమ=ప్రభావముయొక్క, స్తుతిం=స్తోత్రమును, కర్తుం=చేయుటకు, ఉద్యతాయ=యత్నించినవాఁడనై, నిరపత్రపాయ = లజ్జాహీనుఁడైన, కవయే=కవి

నైన, మహ్యం = నాకొఱకు, నమః=నమస్కారము, అస్తు= ఆవుఁగాక.

తా. సృష్టిసంహారకర్తలైన బ్రహ్మరుద్రాదులు నా ద్యశబ్దముచే గ్రహింపఁబడిన [1]వేదాదులును [2]నసమర్థా ఇత్యాదిరీతిగా భగవత్కల్యాణగుణార్ణవమందొక తుంపురులో నేకదేశమును మనస్సుచే నైన నింతమాత్రమని పరిచ్ఛేదించుటకు సమర్థులుగాకుండఁగానట్టి భగవదనన్తకల్యాణగుణైకతానత్వమునున్ను ప్రకృతిబద్ధుఁడనై మందమతినై యత్యల్పుఁడనైన నాయొక్క నికృష్టతనున్ను యోచింపక లజ్జాహీనుఁడనై స్తోత్రముచేయ నుద్యోగించిన నాకొకనమస్కారము జేసుకొనెద నని భావము.

అవ. ఇట్లు స్తోత్రమునుండి విరమించుట నీశ్వరుఁడు గటాక్షించి కొదువగలవాఁడై శ్రీయాళవందారులను గూర్చి నేననంతకల్యాణగుణాత్మకుఁడు గనుక బ్రహ్మాదులును దమతమ

---

1 "యతోవాచోనివర్తన్తే అప్రాప్యమనసాసహ." వేదములు భగవద్గుణములు మనస్సుకు నగోచరములైనందున స్తోత్రమువల్లనుండి మరలుచున్నవి.

2 "నసమర్థాస్సురాః స్తోతుం యమనన్తమజంవిభుం."అపరిచ్ఛేద్యుఁడై హేయప్రతిభటుఁడై సంకల్పమాత్రముచే జగత్సృష్ట్యాది వ్యాపారములఁజేయునట్టి సర్వేశ్వరుని బ్రహ్మరుద్రేంద్రాదులును స్తోత్రముచేయుటకు సమర్థులుగారు.

జ్ఞానశక్తులకొలఁది స్తోత్రము జేయుచున్నారుగాని సాకల్యముగా స్తోత్రముజేయువా రెవరును లేరు మీజ్ఞానశక్తులకొలఁది మీరు స్తోత్రము జేసితిరేని నంతమాత్రమునకే స్తోత్రప్రియుఁడనైన నేను నిరవధికానందము గలవాఁడ నగుచున్నానని సాయించి ప్రవర్తింపఁజేయఁగా మరల యత్నించుచున్నారు:—

శ్లో. యద్వాశ్రమావధియథామతివాప్యశక్తః
స్తౌమ్యేవమేవఖలు తేఽపి సదాస్తువన్తః,
వేదాశ్చతుర్ముఖముఖాశ్చమహార్ణవాన్తః
కోమజ్జతోరణుకులాచలయోర్విశేషః. ౯

టీ. యద్వా=అట్లైనను, అశక్తః=అల్పుఁడనైన నేను, శ్రమావధివా = శక్తికొలఁదియైనను, యథామతివా = జ్ఞానముకొలఁదియైనను, స్తౌమి=స్తోత్రముజేయుచున్నాను. సదా=సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును, స్తువన్తః=స్తోత్రముజేయుచున్న, తే=జ్ఞానశక్త్యాదులచేఁ బ్రసిద్ధములైన, వేదాఅపి=వేదములున్ను, చతుర్ముఖ ముఖాశ్చ = బ్రహ్మ మొదలైనవారును, ఏవమేవఖలు = ఈప్రకారమేగదా, మహార్ణవాన్తః = మహాసముద్రములో, మజ్జతోః = మునుఁగుచున్న, అణుకులాచలయోః=అణువునకును కులపర్వతమునకును, కః=ఏమి? విశేషః=భేదము.

తా. మహాసముద్రమందుమునిఁగినకులపర్వతముదానుగొప్పదైనను సముద్రమునంత నావరింపజాలక యందులోమునిఁగిన యణువురీతిగాఁ దాను నొక

మూల జేరినట్లు సర్వకాలములందు స్తోత్రము జేయుచున్న [1]వేదములును [2]బ్రహ్మాదులును [3]భగవత్కల్యాణగుణములయొక్క సాకల్యస్తోత్రమునందు శక్తిలేనివారైనను దమతమజ్ఞానశక్తుల కొలఁది యేకదేశమునుస్తోత్రము జేయు చున్నట్టువలె నేనును స్తోత్రము జేయుటకుఁ బ్రయత్నపడుట యుక్తమేయని భావము.

అవ. పూర్వశ్లోకమందు బ్రహ్మాదులకువలెఁ దమకును స్తోత్రాధికారము గలదని సాయించి యీశ్లోకమందు నాబ్రహ్మాదులకంటెఁ దమకే పూర్ణాధికారము గలిగియున్నదని సాయించుచున్నారు:—

శ్లో. కిఞ్చైష శక్త్యతిశయేన న తేఽనుకమ్ప్యాః
స్తోతాపితు స్తుతికృతేన పరిశ్రమేణ,

---

1 'సర్వే వేదాయత్పదమామనన్తి.' సమస్తవేదములు భగవద్గుణములనే ప్రతిపాదించుచున్నవి.

2 'తత్కల్యాణగుణాస్వాద పరాబ్రహ్మాదయస్సురాః.' బ్రహ్మాదులెల్లప్పుడు భగవత్కల్యాణగుణముల ననుభవించువారు.

3 'మతిక్షయాన్నివర్తన్తే నగోవిన్దగుణక్షయాత్.' బ్రహ్మాదులు దమజ్ఞానలోపమువలన భగవంతునిస్తోత్రమునుండి మరలుటేగాని యీశ్వరునియందు గుణలోపమువలన మరలుటలేదు.

తత్ర శ్రమస్తుసులభో మమ మన్దబుద్ధే
రిత్యుద్యమోఽయముచితో మమచాబ్జనేత్ర.

టీ. కిఞ్చ = మఱియు, ఏషః = భగవదాభిముఖ్యముచే బద్ధసంసారులకంటె వ్యావర్తకుఁడైన,యీ, స్తోతా = స్తుతించువాఁడు, శక్త్యతిశయేన = సామర్థ్యాతిశయముచేత, తే=నీకు, అనుకమ్ప్యః=కనికరింపఁదగినవాఁడు, న=కాఁడు. అపితు=మఱేమంటె, స్తుతికృతేన=స్తోత్రముచేఁ జేయఁబడిన, పరిశ్రమేణ = బడలికచేత, తే = వాత్సల్యసౌశీల్యాదిగుణములుగల నీకు, అనుకమ్ప్యః = కనికరింపఁదగినవాఁడు, భవతి = అగుచున్నాఁడు. తత్ర=ఆస్తోత్రముజేయుటయందు, మందబుద్ధేః=అల్పమతినైన, మమ=నాకు, శ్రమస్తు=బడలికయైతే, సులభః=సులభము, ఇతి=గనుక, హే అబ్జనేత్ర = నాయొక్క స్తోత్రోద్యోగమును కటాక్షించి యానందముచే వికసించిన తామరపువ్వులవంటి నేత్రములుగల యోస్వామీ! మమ=నాకు, అయం=ఈ, ఉద్యమః=ప్రయత్నము, ఉచితః=తగినదే.

తా. సంసారులయొక్క యద్వేషమాత్రమునే మహాలాభంబుగాఁ దలఁచియుండు నీవు భగవంతుని స్తోత్రమందు జ్ఞానశక్తులు గలవారమని యత్నించుచున్న బ్రహ్మాదులసామర్థ్యంబునుజూచి యనుగ్రహింపక నిన్ను స్తోత్రముజేయవలెనని యత్యాదరముతో యత్నించి జ్ఞానశక్తులు లేనందున స్తోత్రముజేయలేక నతిమాత్రభక్తిచే నూరక యుండు

టకు నోపక తడఁబడుచున్న వారియందుఁ [1]బరిపూ ర్ణానుగ్రహముఁ జేయువాఁడవు గనుకను మహా మతులైన బ్రహ్మాదులయొక్క శ్రమమువలె నిరవధి కము గాక యల్పమతి నైనందున కొద్దిగా నల్ప శ్రమతోనే స్తుతించునట్టి నాకే స్తోత్రాధికారపరి పూర్తిఁ గలదనుట.

అవ. ఇట్లు దమకు స్తోత్రాధికారపరిపూర్తి గలిగియుం డుటను సాయించి యాదియందుఁ బ్రళయార్ణవములోఁ గరణ కళేబరవిధురులై యసత్కల్పులైన చేతనులందు నిర్హేతుకకృ పచేఁ గరణకళేబరప్రదానముజేసి నిరుపాధికబంధువైన నీకా చేతను లభిముఖులుగాఁగా నీవతిమాత్రవాత్సల్యము గలవాఁడ వగుచున్నావనుట నొకవిచిత్రముగాదని సాయించుచున్నారు:—

శ్లో. నావేక్షసేయదితతో భువనాన్యమూని
నాలమ్ప్రభో భవితు మేవ కుతః ప్రవృత్తిః,
ఏవం నిసర్గసుహృదిత్వయి సర్వజన్తో
స్స్వామిన్నచిత్రమిదమాశ్రిత వత్సలత్వమ్. ౧౧

---

1. "నసమర్థా స్సురాః స్తోతుం యమనన్తమజం విభుం, స్వరూపవర్ణనం తస్య కథంయోషి త్కరిష్యతి. స్త్రియోఽను కమ్పాయ్య స్సాధూనాం దీనామూఢాశ్చజన్తవ" ఇత్యాది. బ్రహ్మా దులకలవిగాని భగవద్విషయమును స్తుతించుట కభిలాషనొందిన వారై స్తుతింపలేకున్న స్త్రీలు దీనులు మందమతులు మొదలగు వారు భగవదనుగ్రహముగలవా రగుచున్నారు.

టీ. హేప్రభో = సృష్ట్యాదినిర్వాహకుఁడైన యో స్వామీ! అమూని = ఈ, భువనాని = లోకములను, నావేక్షసేయది = కటాక్షింపకుంటివేని, తతః = పిమ్మట, భవితుమేవ= కలుగుటకే, అలం = సమర్థములు, న = కావు. ప్రవృత్తిః= ప్రవృత్తి నివృత్తులు, కుతః=ఎట్లుగలుగును. హేస్వామిన్=అనివార్యసంబంధముగల యోస్వామీ! ఏవం = ఈప్రకారము, సర్వజన్తోః = బ్రహ్మాదిస్థావరాన్తమైన సమస్త చేతనజాలమునకు, నిసర్గసుహృది = నిరుపాధిక బంధువైన, త్వయి = నీయందు, ఇదం = ఈయవాఙ్మానసగోచరమైన, ఆశ్రితవత్సలత్వం = ఆశ్రితవాత్సల్యము, చిత్రం = ఆశ్చర్యమైనది, న = కాదు.

తా. శ్రియఃపతివై యవాప్తసమస్తకాముఁడై నిత్యముక్తవర్గముతోఁ బరమపదమందుఁ బరిపూర్ణానంద మనుభవింపుచుండినను మూలప్రకృతియందు లీనులై కరణకళేబరశూన్యులై యసత్కల్పులైన చేతనులదుఃఖమునుచూచి [1]వారలకంటె నధికమైనదుఃఖముగలవాఁడవై యనాదికాలముగా వారు జేయుచున్న యపరాధానన్త్యములను యోచింపక

1 "వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః." చేతనులకు దుఃఖముకలిగినపు డీశ్వరుఁడు వారల దుఃఖమును జూచి వారలకంటె నధికముగా తాను దుఃఖమునొందు కృపాతిశయముగలవాఁడు.

వారలదుర్గతినిఁజూచి నిర్హేతుక కృపాపరతంత్రుఁ డవై కటాక్షించి యమోఘసత్య సంకల్పమువలన చతుర్దశభువనములను సృష్టించి యందు బ్రహ్మాది స్థావరాన్తమైన సకలచేతనులకు కరణకళేబర ప్రదానము జేసి యిట్లుపకరించుట తనలాభముగా నెంచబడునట్టి స్వామిత్వముగలవాఁడవై నిష్కారణసుహృత్తైన నీకభిముఖులైన యాశ్రితులం దతిమాత్రమైన వాత్సల్యముగలిగి యుండుట నొక విచిత్రముగా దఖిలకల్యాణగుణాత్మకుఁ డైన నీకది స్వాభావికమే యనుట.

అవ. పూర్వశ్లోకమందు గతిసామాన్య న్యాయముచే సర్వస్వామిత్వమును సాధించి యీశ్లోకమందు సర్వవేదాన్త సారభూతమై అనన్యపరమైన నారాయణానువాకముయొక్క ప్రక్రియచే సర్వేశ్వరత్వమును సాధించుచున్నారు:—

శ్లో. స్వాభావికానవధికాతిశయేశితృత్వం
నారాయణ త్వయి న మృష్యతి వైదికః కః,
బ్రహ్మా శివశ్శతమఖః పరమస్స్వరాడి
త్యేతేఽపియస్యమహిమార్ణవవిప్రుషస్తే. ౧౧

టీ. హేనారాయణ= చేతనాచేతనవిశిష్ట సమస్తప్రపంచమున కాధారాధేయభూతుండ వగునోస్వామీ! త్వయి= నారాయణానువాక ప్రతిపాద్యార్థమైననీయందు, స్వాభావికానవధికాతిశయేశితృత్వం—స్వాభావిక = స్వభావసిద్ధమై, అన

వధిక = అపరిచ్ఛేద్యమై, అతిశయ = సర్వాధికమైన, ఈశి త్వం=సర్వేశ్వరత్వమును, వైదికః = వేదార్థవేదియైన, కః= ఎవ్వఁడు; నమృష్యతి = సహింపఁడు. బ్రహ్మా = చతుర్ముఖుఁడు, శివః = రుద్రుఁడు, శతమఖః = ఇన్ద్రుఁడు, పరమస్వరాట్= ముక్తపురుషుఁడు, ఇతి=అనే, ఏతేఽపి = వీరంబఱును, యస్య= శ్రుతిప్రసిద్ధుఁడవైన, తే = నీయొక్క, మహిమార్ణవవిప్రుషః- మహిమ=మహిమయనెడి, అర్ణవ=సాగరముయొక్క, విప్రుషః= బిందువు లగుచున్నారో.

తా. హిరణ్యగర్భశివశంభ్వాదిశబ్దంబుల సామాన్యాకారముగాఁ బ్రతిపాదింపంబడిన [1]జగత్కారణ

---

1 "నారాయణో జగత్సర్వం సర్గకాలే ప్రజాయతే, పరాదపి పరశ్చాసౌ తస్మాన్నాస్తి పరాత్పరః. ఏతద్ధ్యానం పరందానం యోగశ్చైవపరస్తథా, పరస్పరవిరుద్ధార్థైః కిమన్యైశ్శాస్త్రవిస్తరైః. నారాయణః పరంజ్యోతిస్తత్త్వం నారాయణః పరః, ఆలోడ్యసర్వశాస్త్రాణి విచార్యచ పునఃపునః. ఇదమేకం సునిష్పన్నం ధ్యేయో నారాయణస్సదా. తమీశ్వరాణాం పరమం మహేశ్వరం తందేవతానాం పరమంచ దైవతం, నతత్సమశ్చాభ్యధికశ్చదృశ్యతే. సత్యం సత్యం పునస్సత్యముద్ధృత్య భుజముచ్యతే, వేదాచ్ఛాస్త్రం పరంనాస్తి నదైవం కేశవాత్పరమ్." ఇత్యాది శ్రుతిస్మృతీతిహాసములం దీయర్థమును చూచుకోవలసినది. విస్తరభయమువలన నర్థము వ్రాయలేదు. ఏకఏవ

త్వరూపపరతత్త్వవస్తువును విశేషవాచకనారాయణ శబ్దంబుతో నుచ్చరించి విశేషమందే చేర్చుచున్న నారాయణానువాక తాత్పర్యభూతుఁడవై ఈశ్వరత్వముచేఁ బ్రసిద్ధులైన బ్రహ్మాదులయొక్క ప్రవృత్తినివృత్తులను స్వాధీనముగాఁగల నీయందు సకల వేదాన్తతాత్పర్యార్థమై సమానాధికరహితమై సమస్తవైదికో త్తమసమ్మతంబయిన సర్వేశ్వరత్వమును [1]సమ్మతింపనివాఁ డంత్యజాతి సముద్భూతుం డని నిశ్చయింపంబడును.

అవ. ఇట్లు నారాయణానువాకసిద్ధమైన సర్వేశ్వరత్వమును సర్వదేవతాత్మకత్వమును సాధించి యీశ్లోకమందు సర్వేశ్వరత్వమున కొక టొకటేచాలియుండు నట్టివై యనితర సాధారణములైన పరత్వచిహ్నములను సాధించుచున్నారు:—

శ్లో. కశ్శ్రీ శ్శ్రియః పరమసత్త్వ సమాశ్రయః కః
కః పుణ్డరీక నయనః పురుషో త్తమః కః,
కస్యాయుతాయుతశతైకకలాంశ కాంశే
విశ్వం విచిత్ర చిదచిత్ప్రవిభాగవృత్తమ్. ౧౨

జగత్స్వామీ శక్తిమానచ్యుతః ప్రభుః, తదంశాశ్శక్తి మన్తోన్యే బ్రహ్మేశానాదయోఽమరాః.'

1. 'యః పుత్రః పితరం ద్వేష్టి తం విద్యా దన్యరేతసం, యో విష్ణుం సతతం ద్వేష్టి తం విద్యాదంత్యరేతసమ్.'

టీ. శ్రియః = పెరియపిరాట్టికి, శ్రీః=సంపత్తైనవా
కః = ఎవఁడు? (నీవే యనిభావము.) పరమసత్త్వసమాశ్ర
పరమ = రజోగుణ తమోగుణ స్పర్శము లేమిచే సర్వోః
మైన, సత్త్వ = శుద్ధసత్త్వగుణమునకు, సమాశ్రయః =
యమైన విగ్రహాదులుగలవాఁడు, కః=ఎవఁడు? (నీవే యన
పుణ్డరీకనయనః - పుణ్డరీక = అప్పుడువికసించిన తెల్లదా
వంటి, నయనః = నేత్రములుగలవాఁడు, కః = ఎవఁడు?
యనుట.) పురుషోత్తమః = పురుషసూక్తప్రతిపాదిత పు
త్తమత్త్వముగలవాఁడు, కః = ఎవ్వఁడు? (నీవే యనిభావ
కస్య = ఎవనియొక్క, అయుతాయుతశతైకకళాంశకాం
అసంఖ్యాతములైన కోట్లసంఖ్యలలో నేకదేశాణుమాత్రమ
విశ్వం = అనంతకోటి బ్రహ్మాండ విశిష్టమైన ప్రపంచ
చిదచిత్ప్రవిభాగవృత్తం - చిదచిత్ = చేతనాచేతన
యొక్క, ప్రవిభాగ = పరస్పర మత్యంతము భేదమ
స్వరూపస్థితి ప్రవృత్తులతో, వృత్తం = ఐనది, భవ
అగుచున్నది.

తా. [1]భగవద్వ్యతిరిక్తసమస్తచేతనులచేఁ ఁ
స్వరూపస్థిత్యాదులకై యాశ్రయింపఁబడుటచేత
పిరాట్టి తమ యనన్యార్హశేషత్వాదిరూపస్వ

---

1. శ్లో. "శ్రితాస్యస్యైస్సురైర్వాః శ్రయసిరమణం సం
గిరః శృణోషి ప్రేయాంసం శ్రితజనవచః శ్రావయసి చ, శ
స్యేతద్దోషాన్జనని నిఖిలాం సర్వజగతీం గుణైశ్శ్రీణాసి
తదిహ భవతీం శ్రీరితి విదుః."

పానుగుణముగా నీశ్వరుని నాశ్రయించుటచేతను, ఆర్తులై యాశ్రయించిన చేతనుల నార్తధ్వనులను వినుటచేతను, ఆర్తులైనవారి దీనాలాపములనుఁ దనకు వల్లభుండైన సర్వేశ్వరునికి వినిపించుటచేతను, సకలదుఃఖములకు హేతుభూతములైన పూర్వోత్తరాఘరూప సమస్తపాపములను నశింపచేయుట చేతను, జ్ఞానానంద వాత్సల్య సౌశీల్య సౌలభ్యాది సకలకల్యాణగుణములచేత నుభయవిభూతులను వ్యాపించియుండుటచేతను, యోగరూఢిగా శ్రీ శబ్దమును వహించియున్నవారై [1]తమ యేకవార కటాక్షవీక్షణలేశమాత్రంబుచేతనే చేతనులం దాధిపత్యాద్యైశ్వర్యంబులకుఁ బాత్రులగునట్టు నిరవధికవైభవముగలవారై [2]సకలలోక మాతయైన పెరియ పిరాట్టియారుచేఁ [3]దమయనన్యార్హ శేష

---

1. 'యస్యాః కటాక్షవీక్షాక్షణలక్ష్యం లక్షితామహేశాస్స్యుః.' లక్ష్మీకటాక్షమునకు క్షణకాలము పాత్రమైనవారు బ్రహ్మాదు లగుచున్నారు.

2. 'త్వం మాతా సర్వలోకానాం దేవదేవో హరిః పితా.'

3. 'రాఘవత్వే భవేత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని, అన్యేషు చావతారేషు విష్ణోరేషానపాయినీ, దేవత్వే దేవదేహేయం మనుష్యత్వేచ మానుషీ, విష్ణోర్దేహానురూపాం వై కరోత్యేషాత్మనస్తనుం.'

త్వానన్యశరణత్వానన్యభోగత్వ రూపాకారత్రయముతో నాశ్రయింపంబడిన [1]నిత్యానపాయి వల్లభుండవు గనుకనున్ను [2]సకలచేతనులకు ముక్తిప్రదంబై సర్వాతిశయమైన [3]శుద్ధసత్వగుణంబునకు నివాసస్థానమైనవాఁడవు గనుకనున్ను అగాధమైన జలాశయమందుఁబుట్టినవై సూర్యకిరణములచే వికసించినవై సకలజనాహ్లాదకరమైన తెల్లదామరయొక్క రేకులతో సమానమైనవై కృపారస ప్రవాహాపరిపూర్ణములైనవై [4]ఆకర్ణాంతంబులై [5]శ్రుతిప్రతిపాదితములైన నేత్రములు గలవాఁడవు గనుకనున్ను ఆబ్రహ్మాస్తంబపర్యంతమైన జీవరాసులకు [6]బురుష

1. 'అస్యేశానాజగతోవిష్ణుపత్నీ' పిరాట్టి భగవద్వ్యతిరిక్త సమస్తచేతనుల కీశ్వరియై విష్ణువు కనన్యార్హశేషభూతురాలై వల్లభురాలైనది.

2. 'సత్వేనముచ్యతే జంతుః సత్వం నారాయణాత్మకం.'

3. 'హిరణ్యగర్భోరజసా తమసాశంకరస్స్వయం, సత్త్వేన సర్వగో విష్ణుస్సర్వాత్మా సదసన్మయః.'

4. 'తస్య యథాకప్యాసం పుండరీకమేవమక్షిణీ.'

5. 'సవిష పృథుదీర్ఘాక్షః స్సంబధీతే జనార్దనః.'

6. 'ప్రకృతిం పురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావపి.'

శబ్దము వాచకమై యట్టి పురుషులందు [1] సర్వ విధాతిశయత్వ సర్వేశ్వరత్వాదులచే [2] శ్రుతిస్మృత్యాది ప్రతిపాదిత పురుషోత్తమత్వము యోగ రూఢముగా నీయందే వ్యవహరింపఁబడుటచేత నున్ను, [3] వేదములందు శ్రేష్ఠమైన పురుషసూక్త ముచేఁ బ్రతిపాదింపఁబడుచున్నావు గనుకనున్ను, ఉభయ విభూతులందు చేతనాచేతనవిభాగము లేక [4] సర్వవ్యాపియైన [5] నీయొక్క శరీరైకదేశమందు బ్రహ్మరుద్రాదులు దాము సత్తగలవారై వర్తింపు చున్నారు గనుకనున్ను, కర్మానుగుణముగా సురనర

1. 'అతోఽస్మి లోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః. ఉత్తమః పురుషస్త్వన్యః.'

2. 'సఉత్తమః పురుష ఇతి శ్రుతిః, అంశావతారం పురుషోత్తమస్య హ్యనాదిమధ్యాంతమజస్య విష్ణో' రితి స్మృతిః.

3. 'వేదేషు పౌరుషంసూక్తం ధర్మశాస్త్రేషుమానవం.'

4. 'యస్యాయుతాయుతాంశాంశే విశ్వశక్తిరియంస్థితా, మేరోరివాణుర్యస్యైతద్బ్రహ్మాండమఖిలంమునే, మయిసర్వమిదంప్రోతం సూత్రే మణిగణా ఇవ' ఇత్యాది.

5. 'తపసాతోషితేనైవ విశ్వరూపేణవిష్ణునా, స్వపార్శ్వే దక్షిణేశంభోర్నివాసః పరికల్పితః, ఏవం స్వవిగ్రహాంశేషుతద న్యాఅపి దేవతాః, నిరంకుశస్వతంత్రేణ శ్రీధరేణనివేశితాః.'

తిర్యక్స్థావరరూపభేదముగల చేతనవర్గముచేతను, భూతేంద్రియాది భేదములును, భోగ్యభోగోపకరణ భోగస్థానాది భేదములును గల నచిత్తుచేతనున్ను, వ్యాప్తమైన సమస్తప్రపంచంబు నీయొక్క సంకల్ప సహస్రైక దేశమందు వర్తింపుచున్నది గనుకనున్ను, శ్రుతివిహితమార్గము చేత నాలోచింపఁగా శ్రియఃపతిత్వశుద్ధసత్వాశ్రయత్వ పుండరీకాక్షత్వ పురుషోత్తమత్వ విశ్వాత్మకత్వాదులచే సర్వదేవతా సార్వభౌమత్వము నీయందే స్ఫుటముగా నగపడుచున్నదని భావము.

అవ. ఇట్లు వేదాంతములందుఁ బ్రతిపాదింపఁబడియుండు పరత్వచిహ్నములచే సర్వేశ్వరత్వమును సాయించి యీ శ్లోకమందు వేదముల[1] కుపబృంహణములైన నితిహాసపురాణములచే బ్రహ్మాదులయొక్క చేతనవర్గాంతర్భావమును భగవత్పరత్వమునున్ను సాయించుచున్నారు:—

శ్లో. వేదాపహారగురుపాతకదైత్యపీడా
ద్యాపద్విమోచనమహిష్ఠఫలప్రదానైః,
కోన్యః ప్రజాపశుపతీ పరిపాతి కస్య
పాదోదకేన సశివ స్స్వశిరోధృతేన. ౧౩

1. 'ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్' ఇతిహాసపురాణములచేతనే వేదార్థములను నిర్ణయింపవలసినది.

టీ. వేదాపహారగురుపాతకదైత్యపీడాద్యాపద్విమోచనమహిష్ఠఫలప్రదానైః - వేదాపహార = వేదాపహరణము, గురు= తండ్రియైన బ్రహ్మయొక్క శిరశ్ఛేదమువలనఁగలిగిన, పాతక= పాపము, దైత్య = రావణహిరణ్యాదులవలనఁగలిగిన, పీడా= బాధ, ఆది=మొదలగు, ఆపత్ = ఆపదలనుండి, విమోచన=విడిపించుటచేతను, మహిష్ఠ = సర్వాతిశయములైన, ఫల=అండాధిపత్యాదిఫలములను, ప్రదానైః=ఇచ్చుటచేతను, ప్రజాపశుపతీ =బ్రహ్మరుద్రులను, అన్యః=ఇతరుఁడు, కః=ఎవఁడు? పరిపాతి= రక్షించుచున్నాఁడు. స్వశిరోధృతేన - స్వ=తనయొక్క, శిరః= శిరస్సుచేత, ధృతేన=ధరింపఁబడిన, కస్య=ఎవనియొక్క, పాదోదకేన = శ్రీపాదతీర్థమైన గంగాప్రవాహముచేత, సః=ఆరుద్రుఁడు, శివః=శివశబ్దవాచ్యుఁడు, బభూవ=ఆయెను.

తా. మహదాది క్రమముగా జగత్సృష్టి కాలమందు [1]బ్రహ్మను ముందు సృష్టించి పూర్వప్రళయముచే నంతర్హితములైయున్న వేదంబులను [2]నా బ్రహ్మ కుపదేశింపఁగా నావేదోక్త ప్రకారము సృష్టికార్యమం దన్వయించియున్న [3]బ్రహ్మకు నేత్రస్థానమై నిక్షేపమైయున్న వేదములను మధుకైట

1. 'యో బ్రహ్మాణం విదధాతి పూర్వం.'

2. 'యో వై వేదాంశ్చ ప్రహిణోతితస్మై.'

3. 'వేదా మే పరమంచక్షుః వేదా మేపరమంధనం, వేదా మే పరమంధామ వేదా మే బ్రహ్మచోత్తమం.'

భులను రాక్షసు లపహరించుటచే [1]మహాపన్నుండైన బ్రహ్మనిమిత్తమై వాని ప్రార్థనఁగొని [2]హయగ్రీవావతారముచేసి పాతాళమందుఁ బ్రవేశించి [3]వారలను సంహరించి వేదములనుదెచ్చి మరల బ్రహ్మకుపదేశించి యతనికి గలిగియున్న మహాదుఃఖమును నివర్తింపచేసితివి గనుకనున్ను తమోగుణాభిభూతుఁడైన రుద్రుఁడు లోకపితామహుండైన బ్రహ్మను [4]తన తండ్రి యని యోచింపక [5]నిరపరాధముగా వాని తలఁద్రుంచి యాకపాలము దనచేత నంటుకొని బ్రహ్మహత్యచే బాధపడుచుండఁగా నీవు

1. 'అహో బత మహద్దుఃఖం వేదనాశనజం మమ, ప్రాప్తం దునోతి హృదయం తీవ్రశోకామయస్త్వయం, కోహి శోకార్ణవే మగ్నం మామిహోద్యసముద్ధరేత్.'

2. 'ఏతస్మిన్నంతరే రాజన్ దేవో హయశిరోధరః, జగ్రాహ వేదానఖిలాన్ రసాతలగతాన్ హరిః.'

3. 'తతస్తయోర్వధేనాశు వేదోపహరణేనచ, శోకాపనయనం చక్రే బ్రహ్మణః పురుషోత్తమః.'

4. 'బ్రహ్మణః పుత్రాయ జ్యేష్ఠాయ శ్రేష్ఠాయ విరూపాక్షాయ.'

5. యస్మాదనపరాధస్య శిరశ్ఛిన్నం త్వయామమ, తస్మాచ్ఛాప సమాయుక్తః కపాలీ త్వం భవిష్యసి.'

నిర్హేతుకకృపావాత్సల్యాదులచే వాని బాధను [1]నివ ర్తింపఁజేసితివి గనుకనున్ను [2]రుద్రుని నంధకాసుర [3]త్రిపురాసురాది దైత్యులవలనఁ గలిగిన నాపదల వలననుండి కాపాడితివి గనుకనున్ను, నిన్నాశ్ర యించి కొలుచుచున్న బ్రహ్మరుద్రేంద్రాది సమస్త దేవతలకునీ ప్రకారము దైత్యదానవులవలనఁ గలుగుచున్న యాపదల నివర్తింపచేసి [4]యితరులచే లభింపఁగూడని యభీష్టములఁ గృపచేయుచున్నావు

1. 'విష్ణుప్రసాదాత్సుశ్రోణికపాలం తత్సహస్రధా,స్ఫుటితం బహుధాయాతం స్వప్నలబ్ధం ధనంయథా.'

2. 'తతస్సశంకరో దేవ స్త్వంధకైరాకులీకృతః,జగామశరణం దేవం వాసుదేవమజంవిభుం, తతస్సభగవాన్ విష్ణు స్సృష్టవాన్ శుష్కరేవతీం, సాపపౌసకలం తేషాంమధకానామసృక్ క్షణాత్.' అంధకాసురుని శరీరమునుండి జాఱిన రక్త బిందువులన్ని యు నంధకాసురులై రుద్రుని బాధింపఁగా విష్ణువు శుష్కరేవ తియనే భూతమును సృష్టించి దానివలన నారక్తమును పానము చేయించి తన్ను శరణుఁజొచ్చిన రుద్రుని కాపాడెను.

3. 'విష్ణురాత్మాభగవతో భవస్యామిత తేజసః, తస్మాద్ధనుర్జ్యా సంస్పర్శం సవిషేహే మహేశ్వరః.'

4. 'బ్రహ్మాదయస్సురాస్సర్వే విష్ణుమారాధ్య తే పురా, స్వం స్వంపదమనుప్రాప్తాః కేశవస్య ప్రసాదతః.'

గనుకనున్ను, యింద్రాదులు హిరణ్యరావణనరకాసురాది దుర్వర్గముచే బాధితులై నిన్నాశ్రయింపఁగా నృసింహ రామకృష్ణాది రూపముగా నవతరించి దుష్టుల నశింపఁజేసి యాశ్రితుల నానందింపఁ జేయుచున్నావు గనుకనున్ను, త్రిలోక పితామహుండై తనకుఁ దండ్రియు నైన బ్రహ్మయొక్క శిరచ్ఛేదనంబు వలన మహాపాతకియై శ్మశానములందు నివాసముచే నమంగళుఁడై యక్కడి భస్మశల్యంబులఁ బ్రీతితో నలంకరించుకొనుటఁబట్టి మిక్కిలి దురాచారుండై పిశాచంబులతోడ చేరి నర్తనంబు చేయుచుండెడు రుద్రునిం [1]బరిశుద్ధునిఁగాఁ జేసి [2]శివుఁడని వ్యవహరింపఁబడునట్లు

1. 'ద్రవీభూతస్తథాధర్మో హరిభక్త్యా మహామునే, గృహీత్వాధర్మపానీయం పదంనాథస్యతుష్టయే, క్షాళితం పరయాభక్త్యా పాద్యార్ఘ్యాదిభిరర్చితం, తదంబుపరయాభక్త్యా దధారశిరసాహరః, పావనార్థంజటామధ్యే యోగ్యోస్మీత్యవధారణాత్.'

2. 'యచ్ఛౌచనిస్సృతసరిత్ప్రవరోదకేన తీర్థేన మూర్ధ్నివిధృతేన శివశ్శివోభూత్.' త్రివిక్రమస్వామి శ్రీపాదము పై లోకంబులను వ్యాపించి సత్యలోకంబునకుఁబోగా నచ్చట ధర్మాదిదేవత బ్రహ్మకమండలమును తీర్థంబుగాఁ బరిణమించి పూరింప బ్రహ్మయు మిక్కిలి భక్తితో నాతీర్థముంగొని విష్ణుపాదమును బూజించెను. రుద్రుండు తనజడలం దాపాదతీర్థం

చేయునట్టి శ్రీపాదతీర్థప్రభావము గలవాఁడవు గనుకనున్ను నీవే సర్వస్మాత్పరుఁడవని తాత్పర్యము.

అవ. ఇట్లు ప్రమాణానుకూలతర్కములచే భగవత్పరత్వంబును స్థాపించి యీశ్లోకముచే నిగమించుచున్నారు:—

శ్లో. కస్యోదరే హర విరించి ముఖప్రపఞ్చః
కో రక్షతీమ మజనిష్టచ కస్య నాభేః,
క్రాన్త్వా నిగీర్యపునరుద్గిరతి త్వదన్యః
కః కేన వైషపరవానితి శక్యశఙ్కః. ౧౨

టీ. హరవిరిఞ్చిముఖప్రపంచః-హర=రుద్రుఁడు,విరిఞ్చి=బ్రహ్మ, ముఖ=మొదలుగాగల, ప్రపంచః = విశ్వము, కస్య= ఎవనియొక్క? ఉదరే = గర్భమందు, ఆస్త=ప్రళయకాలమందుండెను. కః=ఎవఁడు? ఇమం = ఈప్రపంచమును, రక్షతి= కాపాడుచున్నాఁడు. కస్య=ఎవనియొక్క? నాభేః=నాభిపద్మమునుండి, అజనిష్టచ = అనంతకోటిబ్రహ్మాండవిశిష్టమైన ప్రపంచముపుట్టెను. త్వత్ = నీకంటె, అన్యః = ఇతరుఁడెవఁడు? క్రాన్త్వా = త్రివిక్రమావతారమందు జగత్తునంతయు నాక్రమించి, నిగీర్య = అవాంతరప్రళయమందు కబళీకరించిగర్భమందుంచుకొని, పునః=మరల, ఉద్గిరతి=బయలుపఱచుచున్నాఁడు. కః=ఎవఁడు? కేనవా = ఏహేతువుచేతనైనను, ఏషః=నీకంటె నితరుఁడైనవీఁడు, పరవాన్ ఇతి = సర్వాతిశయుండని, శక్య

---

బును వహించి తాను పావనుండై తనదమంగళములు నివర్తించి శివుండని వ్యవహరింపఁబడినవాఁ డాయెను.

శంకః-శక్య = సమర్థమైన, శఙ్కాః=వితర్కముగలవాఁడగును. ఎపుడున్ను నిట్టి సంశయముగలవాఁడు కాఁడని భావము.

తా. మహాప్రళయమందుఁ జతుర్వింశతి తత్త్వము లుత్పత్తి క్రమముగాఁ దనకుఁ గారణమైనవానిలో నంతర్భవింపుచు వచ్చి కడపట తమస్తత్త్వము [1]నీయం దంతర్భవింప [2]నీవు సచ్ఛబ్దవాచ్య చేతనాచేతనవిశిష్టుఁడవై ద్విపరార్థకాలమువరకు వానినిఁ గాపాడుకొనుచు [3]నీవొక్కఁడవే యుండి పిమ్మట సృష్టమైనప్పుడును జగత్తునందు [4]బలవంతులు దుర్బలులను బాధింపకుండునట్టుగా వారివారి యిష్టానిష్టప్రాప్తిపరిహారములను జేయుచు గాపాడువాఁడవుగనుకను

---

1. 'తమఃపరేదేవ ఏకీభవతి.'

2. 'సదేవసోమ్యేదమగ్ర ఆసీ' దిత్యాది.

3. 'బ్రహ్మాదిషు ప్రలీనేషు నష్టేలోకేచరాచరే, ఆభూతసంప్లవేప్రాప్తే ప్రలీనే ప్రకృతౌమహాన్, ఏకస్తిష్ఠతివిశ్వాత్మాసతు నారాయణఃపరః. ప్రకృతిర్యామయాఖ్యాతా వ్యక్తావ్యక్తస్వరూపిణీ, పురుషశ్చాప్యుభావేతౌలీయతేపరమాత్మని, పరమాత్మాచ సర్వేషామాధారః పరమేశ్వరః, విష్ణునామాసవేదేషు వేదాన్తేషుచ గీయతే.'

4. 'నసంపదాం సమాహారే విపదాం వినివర్తనే, సమర్థో దృశ్యతే కశ్చిత్తంవినా పురుషోత్తమం, నహిపాలన సామర్థ్య మృతే సర్వేశ్వరం హరిమ్.'

[1]నామరూపవిభాగానర్హమై నీయం దంతర్భవించి యున్న చేతనాచేతనములను [2]సృష్టికాలము రాఁగానే యథాపూర్వముగా సృష్టించుటకు సంకల్పించినపుడు [3]నీయొక్క నాభికమలమునుండే బ్రహ్మరుద్రాదిక్రమముగా సకలప్రపంచంబు సృష్టమగుచున్నది. బలిచక్రవర్తి యీభూమినంత తనదిగా భావించినపుడు [4]సకలదేవతలు స్తోత్రముజేయునట్టు [5]మూడడుగులచేత లోకత్రయమునున్ను గొలిచి

---

1. 'ఏకోహ వై నారాయణఆసీత్, న బ్రహ్మా నేశానో నే మే ద్యావాపృథివీననక్షత్రాణి నాపో నాగ్ని ర్నసోమో నసూర్య స్సఏకాకీ నరమేత.'

2. 'అథ బహుస్యాం ప్రజాయేయ.'

3. 'తత స్తేజోమయందివ్యం పద్మం సృష్టంస్వయంభువా,తస్మా త్పద్మాత్సమభవద్బ్రహ్మావేదమయోవిధిః, మమత్వంనాభితోజాతః ప్రజాసర్గకరః ప్రభోః, సృజప్రజా స్త్వం వివిధాబ్రహ్మాన్ సజడపండితాః, య త్తత్పద్మమభూత్పూర్వం తత్ర బ్రహ్మావ్యజాయత, బ్రహ్మణశ్చాపి సంభూతశ్శివ ఇత్యవధార్యతాం, శివాత్స్కంద స్సమభవదేతత్సృష్టిచతుష్టయం.'

4. 'సంస్తైస్సురాణాం దివిభూతలస్థై స్సంస్తూయమానోవ వృథేవిచిత్రం.'

5. 'ఇదం విష్ణుర్విచక్రమే త్రేధానిదథేపదం.'

యందఱిశిరస్సున నీపాదముంచితివి గనుక [1]యవాంతర ప్రళయములందును జగత్తును నీయందుంచి కాపాడి మఱల బయలుపఱచి రక్షింపుచున్నావు గాన వీనినన్నింటిని నాలోచింపఁగా నీవు శ్రియఃపతిగాను, మఱియొకఁడు కాళీపతిగాను, నీవు శుద్ధసత్త్వగుణముగలవాఁడుగాను, మఱియొకఁడు తమోగుణాభిభూతుఁడుగాను, నీవు పుండరీకాక్షుఁడుగాను, మఱియొకఁడు విరూపాక్షుఁడుగాను, నీవు పురుషోత్తముఁడుగాను మఱియొకఁడు పురుషమాత్రుఁడుగాను, నీవు విశ్వాత్మకుఁడుగాను మఱియొకఁడు నీవిశ్వమం దంతర్భూతుఁడుగాను, నీవు సర్వపాతకవిమోచకుఁడుగాను, మఱియొకఁడు మహాపాతకిగాను, నీవిష్టానిష్టప్రాప్తిపరిహారకుఁడుగాను, మఱియొకఁడు కర్మానుగుణముగా నిష్టముల సంపాదించుకొనువాఁడుగాను, నీవు నిత్యుఁడుగాను, మఱియొకఁ డుత్పత్తివినాశములు గలవాఁడుగాను, నీవు రక్షకుఁడుగాను మఱియొకఁడు రక్ష్యభూతుఁడుగాను, నీవు పరమపదనివాసుఁడుగాను, మఱియొకఁడు శ్మశాననివాసుఁడుగాను, నీవు నిత్యసూరి

1. "త్యజన్తమాహరన్తం చ శ్వాసోచ్ఛ్వాసద్వయేన చ, ఆ బ్రహ్మభువనం సర్వం కర్మప్రాధానికం హి యత్."

పరివన్నిర్వాహకుఁడుగాను, మఱియొకఁడు పిశాచ
కులాధిపతిగాను నుండుటబట్టి తేజోంధకారములకు
వలె నీకున్నితరులకున్న వాఙ్మానసగోచరమైన తార
తమ్యముగలిగియుండుటచే నెట్టివారికైనను భవ
ద్వ్యతిరిక్తులయం దెంతమాత్రము పరత్వశంకయే
కలుగనేరదని తాత్పర్యము.

అవ. ఇట్లు శ్రుతిస్మృతీతిహాసపురాణ ప్రతిపాదితమగు
సర్వస్మాత్పరత్వమును సాధించి యీశ్లోకమందుదృఢతరప్రమాణ
సిద్ధుండగునీశ్వరుని గొంద ఱాసురప్రకృతులు దొలఁగఁదోసికొని
పోవుటను గటాక్షించి వారలదౌర్భాగ్యమునకై ఖేదమునొందు
చున్నారు:—

శ్లో. త్వాం శీలరూపచరితైః పరమప్రకృష్ట
సత్త్వేన సాత్త్వికతయా ప్రబలైశ్చశాస్త్రైః,
ప్రఖ్యాత దైవ పరమార్థ విదాం మతైశ్చ
నైవాసురప్రకృతయః ప్రభవంతి బోద్ధుమ్. ౧౫

టీ. త్వాం = నిరుపాధికశేషియగు నిన్ను, శీలరూపచరితైః-
శీల=సౌశీల్యాదిగుణములచేతను, రూప=దివ్యమంగళవిగ్రహము
చేతను, చరితైః=అతిమానుషచేష్టలచేతను,పరమప్రకృష్టసత్త్వేన-
పరమ = రజస్తమస్సులసంబంధములేమిచే సర్వాతిశయమై, ప్రకృష్ట=
మోక్షమునకే హేతువైనది గనుక శ్రేష్ఠమైన, సత్త్వేన = శుద్ధ
సత్వగుణముచేతను, సాత్త్వికతయా = సాత్త్వికకల్పప్రోక్తమగు

టచే, ప్రబలైః = తత్త్వనిర్ధారణసామర్థ్యముగల, శాస్త్రైశ్చ = శాస్త్రములచేతనున్ను, ప్రఖ్యాతదైవపరమార్థవిదాం-ప్రఖ్యాత= ప్రసిద్ధులై, దైవపరమార్థ = దేవతాపారమార్థ్యమును, విదాం= గుర్తెఱిఁగినవారియొక్క, మతైశ్చ = అభిప్రాయములచేత నున్ను, ఆసురప్రకృతయః = తామసప్రకృతిగలవారు, బోద్ధుమేవ = తెలుసుకొనుటకే, నప్రభవంతి = సమర్థులుగారు.

తా. [1]సర్వాతిశయుఁడైనవాఁడు సర్వవిధముల చేతను మిక్కిలి నికృష్టులైనవారితో నఱమఱలేక కలసి మెలసి యుండుట సౌశీల్యము. అట్టి సౌశీల్య గుణముచేఁ బరిపూర్ణుండవై [2]ఆశ్రితానాశ్రితులకా భరణాయుధరూపములై యున్న శంఖచక్రగదా సిశార్ఙ్గంబులచే నలంకృతంబై పీతాంబరభాసురంబై వనమాలికావిరాజమానంబై సకలలోకముల మోహింపఁజేయునట్టి మన్మథునికిన్ని మోహాకరమగు దివ్యమంగళ విగ్రహముగలవాఁడవై దేవదానవ మానుషుల కశక్యంబులగు [3]త్రివిక్రమత్వ [4]మహార్ణ

1. "శీలం నామ మహత్తరస్యాపి మందతరైస్సహనీరంధ్రసంశ్లేషః."

2. "తమసఃపరమోధాతా శంఖచక్రగదాధరః, పీతాంబరధరః స్రగ్వీసాక్షాన్మన్మథమన్మథః."

3. "ఇదం విష్ణుర్విచక్రమే, త్రేధానిదధేపదం."

4. "యద్రోమగర్తేషు విలిల్యురబ్ధయస్తస్మై నమః కారణసూక

వమగ్న వసుంధరోద్ధరణా[1]మృతమథన[2]గోవర్ధనోద్ధర ణాది విచిత్ర వ్యాపారములఁ జేయువాఁడవై [3]అప్రాకృతశుద్ధసత్త్వాశ్రయుండవై [4]సాముద్రికశాస్త్రప్రతి

---

రాయ, దంష్ట్రాగ్రకోట్యా భగవంస్త్వయాధృతా విరాజతే భూధరభూస్సభూధరా.”

1. “మేఘశ్యామఃకనకపరిధిః కర్ణవిద్యోత విద్యున్మూర్ధ్ని భ్రాజద్విలులితకచః స్రగ్ధరో రక్తకంఠః, జైత్రైర్దోర్భిర్జగదభయ దైర్దండశూకంగృహీత్వా మథ్నన్మథ్నాప్రతిగిరి రివా శోభ తాథోద్ధృతాద్రిః.”

2. “ఇత్యుక్త్వైకేనహస్తేన ధృత్వాగోవర్ధనాచలం,దధారలీల యా కృష్ణశ్ఛత్రాక మివబాలకః.”

3. “సత్త్వేన సర్వగో విష్ణు స్సర్వాత్మా సదసన్మయః.”

4. “సంకీర్ణాస్తామసాశ్చైవరాజసా స్సాత్వికాస్తథా, కల్పా శ్చతుర్విధాః ప్రోక్తా బ్రహ్మణోదివసాత్యయే. యస్మిన్ కల్పేతు యత్ప్రోక్తం పురాణం బ్రహ్మణాపురా, తస్యతస్యతుమాహాత్మ్యం తత్స్వరూపేణవర్ణ్యతే. అగ్నేశ్శివస్య మాహాత్మ్యం తామసేషు ప్రకీర్త్యతే, రాజసేషుచ మాహాత్మ్యమధికం బ్రహ్మణోవిదుః. సంకీర్ణేషు సరస్వత్యాః పితౄణాం చ నిగద్యతే, సాత్వికేష్వథకల్పేషు మాహాత్మ్యమధికంహరేః, తేష్వేవయోగ సంసిద్ధా గమిష్యంతి పరాంగతిం.”

పాదిత పరత్వముగలవాఁడవై సకలప్రపంచసాక్షాత్కారముగలవారై [1]ఆప్తతములైన [2]వ్యాస [3]వాల్మీకి [4]పరాశరాదిమహర్షులచే సర్వదేవతాసార్వభౌముఁడుగా నిర్ణయింపంబడినవాఁడవై [5]సకలచేతనాచేతనముల కంతర్యామియై [6]సర్వలోకశరణ్యుండవైన నిన్నుం దెలియక [7]యాసురప్రకృతులగు గొం

---

1. ఆప్తతములనఁగా నొకవిషయమును యథార్థముగా దెలిసికొని దాము దెలిసికొనిన ప్రకారముగా నితరులకుఁ దెలుపువారు.

2. "తత్త్వం జిజ్ఞాస మానానాం హేతుభిస్సర్వతోముఖైః, తత్త్వమేకో మహాయోగీ హరిర్నారాయణఃపరః. సత్యం సత్యం పునస్సత్యముద్ధృత్యభుజముచ్యతే, వేదశాస్త్రాత్పరం నాస్తి నదైవం కేశవాత్పరం. ఆలోచ్యసర్వశాస్త్రాణి విచార్యచ పునః పునః, ఇదమేకం సునిష్పన్నం ధ్యేయో నారాయణస్సదా."

3. "సహిదేవై రుదీర్ణస్య రావణస్య వధార్థిభిః, అర్థితో మానుషేలోకే జజ్ఞేవిష్ణుస్సనాతనః. అధికం మేనిరే విష్ణుం దేవాస్సర్షి గణాస్తథా."

4. "విష్ణోస్సకాశా దుద్భూతం జగత్తత్రైవచస్థితం, స్థితిసంయమకర్తాసౌ జగతోస్య జగచ్చసః."

5. "యస్యాత్మా శరీరం యస్య పృథివీశరీరం."

6. "సర్వలోక శరణ్యాయ రాఘవాయ మహాత్మనే."

7. "ద్వివిధోభూత సర్గోయం దైవ ఆసురఏవచ,విష్ణుభక్తిప

దలు నీయం దసూయగలవారై యనర్థపడి పోవు చున్నారు గదా వారల దౌర్భాగ్య మెట్టిదో యని భావము.

అవ. ఇట్లాసురప్రకృతుల దౌర్భాగ్యమునకై ఖేదమొంది జాయమాన కాలకటాక్షపాత్రులగు కొందఱు భాగ్యాధికులీశ్వ రుని సర్వరక్షకత్వమును దెలిసికొని యనన్యప్రయోజనులై యుజ్జీవించుటను గటాక్షించి యానందించుచున్నారు:—

శ్లో. ఉల్లఙ్ఘిత త్రివిధసీమ సమాతిశాయి
సమ్భావనం తవపరి బ్రఢిమస్వభావం,
మాయాబలేన భవతాపి నిగూహ్యమానం
పశ్యన్తి కేచి దనిశం త్వదనన్యభావాః. ౧౬

టీ. ఉల్లంఘిత త్రివిధసీమ సమాతిశాయి సంభావనం- ఉల్లంఘిత=దాటఁబడిన, త్రివిధసీమ = దేశకాలవస్తుపరిచ్ఛేద ముయొక్క, సమ = సములయొక్క, అతిశాయి = అధికుల యొక్క, సంభావనం = తలంపుగల, తవ=దేవరవారియొక్క, పరిబ్రఢిమస్వభావం = ఉభయవిభూతినాథత్వమును, మాయా బలేన = ప్రకృతిబలముచేత, భవతా=నీచేత, నిగూహ్యమాన

---

రోదైవో విపరీత స్తథాసురః. దేవానాం చ పరోధర్మ స్సదాయజ్ఞ రతాః క్రియాః, స్వాధ్యాయ స్తత్త్వ వేదిత్వం విష్ణుపూజారతి స్తథా. దైత్యానాం బహుమానత్వం మాత్సర్యం సత్త్వసత్క్రి యా, నిందనం వేదశాస్త్రాణాం హరభక్తిరనుత్తమా.”

మపి = కప్పఁబడు చున్నదైనను, త్వదనన్యభావాః| = త్వదేక భోగులైన, కేచిత్ = కొందఱు మహాత్ములు, అనిశం = సర్వ కాలమందు, పశ్యన్తి = ఉన్నదున్నట్టు సాక్షాత్కరించు చున్నారు.

తా. [1]జననమరణరూప సంసారచక్రమందుఁ బరి భ్రమింపుచు దుఃఖార్ణవమగ్నులై యున్న చేతను లలో నొకానొకని నొకానొక[2]జననమునఁ దల్లిగర్భ మునుండి భూపతనకాలమందు నిరంకుశస్వతంత్రుం డగు నీశ్వరుండు నిర్హేతుకముగాఁ గటాక్షించుచు న్నాఁడు. అట్లు జాయమానకాలకటాక్షపాత్రులగుట చే సాత్వికాగ్రగణ్యులైన భాగ్యాధికులు గొందఱు [3]విభువగుటచే దేశపరిచ్ఛేదరహితమై [4]నిత్యమగుట చే కాలపరిచ్ఛేదరహితమై [5]సర్వప్రకారములచేత వేఱుండుటకు యోగ్యమైన వస్త్వంతరము లేనందు

1. "ఏవం సంసృతిచక్రస్థే భ్రామ్యమాణే స్వకర్మభిః, జీవేదుఃఖాకులేవిష్ణోః కృపాకా ప్యుపజాయతే."

2. "జాయమానం హి పురుషం యం పశ్యేన్మధుసూదనః సాత్వికస్సతు విజ్ఞేయస్సవై మోక్షార్థచింతకః."

3. "సత్వేన సర్వగోవిష్ణుస్సర్వాత్మా సదసన్మయః."

4. "అనాది నిధనం దేవం ప్రభుం నారాయణం హరిం."

5. "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణస్థితః."

వలన వస్తుపరిచ్ఛేద రహితమై [1]సములున్న ధికులును లేనందువలన సమానాధికరహితమై యున్న నీయొక్క సర్వస్వామిత్వమును [2]సదాచార్యద్వారా నీవు సాక్షాత్కరింపఁజేయఁగాఁ దెలిసికొని దేవతాంతర మంత్రాంతర సాధనాంతర ప్రయోజనానంతరముల రోసి [3]దేవరవారి తిరువడిగళు నేయుపాయముగా వరించి యజ్ఞానాన్యథాజ్ఞానవిపరీతజ్ఞానజనకంబగు ప్రకృతికి లోబడక [4]దేవరవారి శ్రీపాదములందు సర్వవిధదాస్యమే స్వరూపోచితంబని దేవరవారి ముఖోల్లాసమే పరమపురుషార్థంబని దెలిసికొను చున్నారు గదా వారల భాగ్యాతిశయ మేమని భావము.

అవ. పూర్వశ్లోక ప్రతిపాదితంబగు సర్వేశ్వరత్వమును ప్రతిసంబంధియగు నీశితవ్యజాతముచే నిర్ధారణ చేయుచున్నారు:—

---

1. "న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే."

2. "నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన, యమేవైష వృణుతే తేన లభ్యః తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వాం."

3. "దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా, మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరన్తితే."

4. "నాకించిత్కుర్వతశ్శేషత్వానుపపత్తిః."

శ్లో. యదణ్డమణ్డాన్తర గోచరఞ్చ య
ద్దశోత్తరాణ్యావరణాని యానిచ,
గుణాః ప్రధానం పురుషః పరంపదం
పరాత్పరం బ్రహ్మచ తే విభూతయః. ౧౭

టీ. అణ్డం = చతుర్దశభువనాత్మకమైన బ్రహ్మాణ్డము, యత్=యేదిగలదో, అదిన్ని, యచ్చ=యేదైతే, అణ్డాంతరగోచరం-అణ్డాంతర=బ్రహ్మాణ్డమధ్యమందు, గోచరం=కనుబడుచున్నదో, అదిన్ని, దశోత్తరాణి=ఒకటికొకటి పదింతలైన, ఆవరణానిచ = తోయాద్యావరణములును, యాని = ఏవో, అన్ని, గుణాః = సత్వరజస్తమోగుణములు, ప్రధానం = ప్రకృతి, పురుషః = చేతనసముదాయము, పరంపదం = పరమపదము, పరాత్ బ్రహ్మచ = శుభాశ్రయమగు దివ్యమంగళ విగ్రహమును, తే=దేవరవారియొక్క, విభూతయః = ఐశ్వర్యములు.

తా. స్వసంకల్పమాత్రసృష్టములై చతుర్దశభువనాత్మకములై [1]అసంఖ్యాతములగు బ్రహ్మాణ్డములును [2]అండాంతర్వర్తులగు నాబ్రహ్మస్తంబపర్యంతమైన జీవరాసులును [3]ఒకటికొకటి పదింత లతిశయించియుండు

1. "అండానాం తు సహస్రాణాం సహస్రాణ్యయుతాని చ, ఈదృశానాం తథా తత్ర కోటికోట్యయుతాని చ."

2. "ఆబ్రహ్మస్తమ్బ పర్యన్తా జగదన్తర్వ్యవస్థితాః, ప్రాణినః కర్మజనితా స్సంసారవశవర్తినః."

3. "దశోత్తరేణ పయసా మైత్రేయాండంచ తద్వృతం,

నట్టి జలాగ్ని వాయ్వాద్యావరణములును సంసార బంధకారణములగు సత్వరజస్తమోగుణములును మూలప్రకృతియు బద్ధాత్మసమష్టియు [1]కోటిసూర్య ప్రకాశమై అప్రాకృతమైన పరమపదమును బ్రహ్మాదులకంటె సర్వవిధములచే నతిశయులగు ముక్తులును వారలకంటె నతిశయులగు నిత్యవర్గంబును శుద్ధసత్వమయంబయి సకలకల్యాణగుణాస్పదంబై నిరవధికతేజోరూపంబై బృహత్వబృంహణత్వగుణయోగంబుచే బ్రహ్మశబ్దవాచ్యంబై యత్యంతాభిమతమయిన దివ్యమంగళవిగ్రహంబును నివియన్నియు [2]దేవరవారికి నియామ్యంబులై శేషభూతంబులైనవని భావము.

అవ. ఇట్లు సర్వప్రకారంబులచే సర్వేశ్వరత్వంబును బ్రతిపాదించి యిట్టి భగవంతుని నల్పులై యజ్ఞులై యశక్తులై

---

సర్వాంబుపరిధానో సౌ వహ్నినా వేష్టితో బహిః, వహ్నిశ్చ వాయునా వాయుర్మైత్రేయ నభసావృత" ఇత్యాది.

1. "అత్యర్కానల దీప్తం తత్స్థానం విష్ణోర్మహాత్మనః, స్వయైవ ప్రభయా రాజన్ దుష్ప్రేక్ష్యం దేవదానవైః, తత్ర గత్వా పునర్నేమం లోకమాయాంతి భారత."

2. "క్షయంతమస్య రజసః పరాకే, ఆదిత్యవర్ణం తమసః పరస్తా" దిత్యాది.

యున్న బద్ధులును మిక్కిలి సులభముగా నాశ్రయించుటకును ఇష్టానిష్టప్రాప్తి పరిహారంబులను బొందుటకును నుపయుక్తంబు లైన కల్యాణగుణంబులు గలిగియుండుటను సాధించుచు న్నారు:—

శ్లో. వశీ వదాన్యో గుణవానృజు శ్శుచి
ర్మృదు ర్దయాళు ర్మధుర స్థిర స్సమః,
కృతీ కృతజ్ఞ స్త్వమసి స్వభావత
స్సమస్తకల్యాణగుణామృతోదధిః. ౧౮

టీ. వశీ=ఆశ్రితపరాధీనుఁ డైనవాఁడును, వదాన్యః = నిరవధికౌదార్యముగలవాఁడును, గుణవాన్ = సౌశీల్యగుణము గలవాఁడును, ఋజుః = ఆర్జవగుణముగలవాఁడును, శుచిః = పావనుఁడైనవాఁడును, మృదుః = సంశ్రితవిశ్లేషమును సహింప లేనివాఁడును, దయాళుః = పరదుఃఖాసహిష్ణుఁడైనవాఁడును, మధురః = మాధుర్యముగలవాఁడును, స్థిరః = చలింపనిప్రకృతి గలవాఁడును, సమః = సర్వసముఁడైనవాఁడును, కృతీ = కృత కృత్యుఁడవైన వాఁడును, కృతజ్ఞః = స్వల్పోపకారమునున్ను మఱువనివాఁడు నైన, త్వం = నీవు, స్వభావతః=సైజముగా = సమస్తకల్యాణ గుణామృతోదధిః - సమస్త = సకలములైన, కల్యాణ=మంగళకరములైన, గుణ=ఆత్మగుణములనే, అమృత= అమృతప్రవాహములకు, ఉదధిః = రత్నాకరమువంటివాఁడవు, అసి=అగుచున్నావు.

తా. శ్రియఃపతియై యవాప్తసమస్తకాముఁడై ఉభయవిభూతినాథుండవైయ్యు నాశ్రితులకు[1] నిష్టకార్యములందు నియమించి సాధించు కొనునటుల నత్యంతపరతంత్రుఁడవై యట్టి[2] పారతంత్ర్యముతో నఖిలాభీష్టంబులఁ గృపఁజేయునట్టి మహోదారుఁడవై యిట్లుపకరించునపుడు నీదు[3] సర్వాతిశయమునున్ను చేతనుల నత్యంత నికృష్టతనున్ను యోచింపక కలసి మెలసి వర్తించునట్టి సౌశీల్యముగలవాఁడవై యాశ్రితులు[4] నానావిధ స్వభావులై యుండఁగా వారలయొక్క యఖిలాభిలాషానుగుణముగా గరణత్రయమందు నేకాకారుండవై వర్తించుటయను నార్జవగుణముగల

1. "ఇమౌస్మ మునిశార్దూల కింకరౌ సముపస్థితౌ, ఆజ్ఞాపయ యథేష్టంవై శాసనం కరవావ కిం."

2. "యఆత్మదో బలదః, ఏకోబహూనాం యోవిదధాతి కామాన్, ప్రియవాగ్దానశీలశ్చ వదాన్యః పరికీర్తితః."

3. "గుహామాసాద్య ధర్మాత్మా నిషాదాధిపతిం ప్రియం, సోభ్యగచ్ఛన్మహాతేజాశ్శబరీం శత్రుసూదనః."

4. "తద్వైతథాస్తుకత మోయ మహోస్వభావో యావాన్యథావిధగుణో భజతే భవంతం, తాహాం స్తథావిధగుణస్తదధీనవృత్తిస్సంశ్లిష్యసిత్వ మిహ తేన సమానధర్మా."

వాఁడవై [1]బద్ధసంసారులను నస్పృష్ట సంసారగంధు లగు నిత్యసూరులతోఁ జేర్చునట్టి పరమపావనుండ వై [2]ఆశ్రితవిశ్లేషమును సహింపలేని మృదుస్వభావముగలవాఁడై పరదుఃఖాసహిష్ణువైన దయారసము చేఁ బూర్ణుఁడవై [3]నిర్దయుండుగానున్నను విడువకూడని భోగ్యతాతిశయము గలవాఁడై [4]శరణాగతరక్షణమందు చలింపనివాఁడవై [5]అభిజనవిద్యావృత్తముల కనుగుణముగా వైషమ్యము గలిగి యుండక సర్వజనులకు సమానుండవై [6]యాశ్రితకార్యములను నెరవేర్చి తన్నుఁ గృతకృత్యునిఁగాఁ

1. "పావన స్సర్వలోకానాం త్వమేవ రఘునందన."

2. "కదాన్వహం సమేష్యామి భరతేన మహాత్మనా, వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః."

3. "రసోవై సః రసగ్ హ్యేవాయం లబ్ధ్వానందీభవతి."

4. "మిత్రభావేన సంప్రాప్తం నత్యజేయం కథంచన, ఆర్తో వా యది వా దృప్తః పరేషాం శరణాగతః, అరిః ప్రాణాన్ పరిత్యజ్యరక్షితవ్యః కృతాత్మనా.

5. "సమోహం సర్వభూతేషు నమేద్వేష్యోస్తి నప్రియః."

6. "అభిషిచ్య చ లంకాయాం రాక్షసేంద్రం విభీషణం, కృతకృత్యస్తదారామో విజ్వరః ప్రముమోదహ."

దలంచువాఁడవై [1]యాశ్రితులయొక్క యాను కూల్యలేశమునే మహత్తుగాఁదలఁచి వారల సక లాపరాధంబుల నోర్చుకొనుచు నఖిలాభీష్టములను గృపఁజేయు కృతజ్ఞుండవైన నీవీప్రకారము [2]స్వభావ సిద్ధంబులై యసంఖ్యాతంబులై యతిభోగ్యంబులై యున్న [3]కల్యాణగుణంబులను నమృతప్రవాహంబు లకు మహార్ణవమువలె స్థానభూతుండవై యున్నా వని భావము.

అవ. సర్వేశ్వరునియొక్క సమస్తకల్యాణ గుణపరిపూ ర్ణత్వమును సాయించి యందులో నొక్కొకగుణమే వేదముల కైనను వాఙ్మనస్సులచేతనున్ను పరిచ్ఛేదింపఁగూడనిదై సర్వాతి శయమై యుండుటను సాయించుచున్నారు:—

---

1. "శతమప్యపరాధానాం నస్మరత్యాప్తవత్తయా, కథం చిదుపకారేణ కృతేనైకేన తుష్యతి. గోవిందేతి యదాక్రం దత్కృష్ణా మాందూరవాసినం, ఋణం ప్రవృద్ధ మివమే హృద యాన్నాపసర్పతి."

2. "యథారత్నానిజలధే రసంఖ్యేయానిపుత్రక, తథాగుణా హ్యనంతస్యా ప్యసంఖ్యేయా మహాత్మనః."

3. "గుణాస్సత్యజ్ఞానప్రభృతయ ఉత త్వద్గతతయాశుభీ భూయం యాతా ఇతి హినిరజైష్మ శ్రుతివశాత్."

శ్లో. ఉపర్యుపర్యబ్జభువోఽపి పూరుషాన్
ప్రకల్ప్య తేయే శతమిత్యనుక్రమాత్,
గిరస్త్వదేకైక గుణావధీప్సయా
సదాస్థితానోద్యమతోఽతిశేరతే. ౧౯

టీ. గిరః=వేదములు, అబ్జభువః = బ్రహ్మలయొక్క, ఉపర్యుపర్యపి = మీఁదుమీఁదుగానున్న, పూరుషాన్ = మనుష్యులను, తేయేశతమితి = తేయేశతమనే, అనుక్రమాత్ = తానుపఠించియుండు క్రమముగా, ప్రకల్ప్య=కల్పించి, త్వదేకైకగుణావధీప్సయా - త్వత్=దేవరవారియొక్క, ఏకైకగుణ= ఒక్కొక్క కల్యాణగుణముయొక్క, అవధి = అంతమును, ఈప్సయా=పొందనిచ్ఛచేత, సదాస్థితా = ఎల్లపుడున్నవగుచు, ఉద్యమతః=ఉపక్రమణమునకంటె, నాతిశేరతే = అతిశయింపకున్నవి.

తా. అపౌరుషేయములై నిత్యనిర్దోషములై యుండు వేదంబు లపరిచ్ఛిన్నములై యసంఖ్యాతములై యనవధికములైన దేవరవారికల్యాణగుణములలో నొక్కొకదానిస్వరూపమును చెప్పుటకిచ్ఛచే బ్రథమమున నానందగుణ స్వరూపమును జెప్పుట కారంభించి మనుష్యానందము మొదలు నరపతి సురపతి ప్రజాపత్యాద్యానందములను వర్ణించి యాచతుర్ముఖ బ్రహ్మానంద మీశ్వరానందముతోఁ

గోటికోట్యంశము చేతనైన పోలనందున నాచతుర్ముఖ బ్రహ్మానుమనుష్యకోటియందుంచి తదపేక్షయా చతుర్ముఖుని పర్యంతము బోవుచు మరల నాబ్రహ్మానున్ను మనుష్యకోటియందుఁ జేర్చుకొనుచు నీప్రకారము పూర్వులకంటె నుత్కృష్టులను గల్పించుకొనుచు 'తేయే శత'మని యనేకబ్రహ్మల నీప్రకార మెచ్చించుకొనుచుంబోయి నీయానందగుణమును నిర్ణయించుటకు శక్తిలేనిదై సర్వకాలమందును నానంద గుణస్వరూప నిర్ణయోపక్రమదశయందే వర్తించుచున్న యవి గాన దేవరవారి కల్యాణగుణములతో నొకటొకటే వేదపురుషునియొక్క వాఙ్మనస్సులకున్న గోచరమై యపరిచ్ఛేద్యమై యున్నది.

అవ. ఈప్రకారమపరిచ్ఛిద్యములై యసంఖ్యేయములై పరమభోగ్యములైయున్న నీశ్వరుని కల్యాణగుణముల ననన్యప్రయోజనులై యనుభవింపుచు నానందనిర్భరులై యుండు పరమభాగవతోత్తములఁ గొనియాడుచున్నారు:—

శ్లో. త్వదాశ్రితానాం జగదుద్భవస్థితి
ప్రణాశ సంసార విమోచనాదయః,
భవంతి లీలా విధయశ్చవైదికా
స్త్వదీయగమ్భీర మనోను సారిణః. ౨౦

టీ. త్వదాశ్రితానాం = అనన్యప్రయోజనులై దేవరవారి నాశ్రయించియుండువారికి, జగదుద్భవస్థితి ప్రణాశ

సంసార విమోచనాదయః - జగత్ = ప్రపంచముయొక్క, ఉద్భవ= సృష్టిస్థితి పాలనము, ప్రణాశ= ప్రళయము, సంసారవిమోచన = పరమపదప్రాప్తియు, ఆదయః = అవతారపరిగ్రహము మొదలైనవి, లీలాః = విలాసములు, భవంతి = అగుచున్నవి. వైదికాః=వేదవిహితములైన, విధయశ్చ = విధులున్ను, త్వదీయగంభీర మనోనుసారిణః - త్వదీయ = నిన్నాశ్రయించియుండు భాగవతోత్తములయొక్క, గంభీర = అగాధమైన, మనః=తిరువుళ్లములను, అనుసారిణః = అనుసరించినవి, భవంతి= అగుచున్నవి.

తా. దేవరవారి విషయమందు గుణానుభవకైంకర్యములే ధారకపోషక భోగ్యములుగానుండు ముక్తపురుషులు సృష్టిస్థితిలయమోక్షప్రదానాది వ్యాపారముల [1]సంకల్పమాత్రముచే జేయుటకు శక్తులైయుండియు భగవదేకకర్తవ్యము లగుటచే దమస్వరూపానుగుణముగా నున్నారు. [2]నీయొక్క యాజ్ఞారూపములైన శ్రుతి స్మృత్యాదులందలి సకలవైదికవిధులును [3]తాపత్రయాదులకు చలింపని

1. "సంకల్పాదేవాస్య పితరస్సముత్తిష్ఠంతి."

2. "శ్రుతిస్మృతిర్మమైవాజ్ఞా యస్తాముల్లఙ్ఘ్య వర్తతే."

3. "గిరయో వర్షధారాభిర్హన్యమానా నవివ్యధుః,
విధూయమానా వ్యసనైర్యథాధోక్షజచేతసః."

నీయాశ్రితుల [1]హృదయము ననుసరించి వర్తింపుచున్నవి యనిభావము.

అవ. ఈప్రకారము శ్రియఃపతియై యవాప్తసమస్తకాముఁడై యుభయవిభూతినాథుఁడై యఖిలకల్యాణగుణాత్మకుఁడై యాశ్రితవాత్సల్యైకజలధియగు నీశ్వరుని ననుభవించి వానిగుణముల కోడినవారై తమ స్వరూపానుగుణమైనకృత్యము ననుష్ఠించుచున్నారు:—

శ్లో. నమోనమో వాఙ్మనసాతిభూమయే
నమో నమో వాఙ్మనసైక భూమయే,
నమోనమోనన్త మహావిభూతయే
నమోనమోనన్తదయైకసిన్ధవే. ౨౧

1. "ధర్మజ్ఞ సమయః ప్రమాణం వేదాశ్చ, అథ యది తే కర్మవిచికిత్సావావృత్తవిచికిత్సావాస్యాత్, యేతత్ర బ్రాహ్మణాస్సమ్మర్శినః, యుక్తా అయుక్తాః అలూక్షా ధర్మకామాస్స్యుః యథా తే తత్రవర్తేరన్ తథా తత్ర వర్తేథాః, అథాభ్యాఖ్యాతేషు యే తత్ర బ్రాహ్మణా స్సమ్మర్శినః యుక్తా అయుక్తాః అలూక్షా ధర్మకామాస్స్యుః యథా తే తేషు వర్తేరన్ తథా తేషువర్తేథాః, ఏష ఆదేశః ఏషఉపదేశః" ఇత్యాది.

"వేదశాస్త్ర రథారూఢా న్యాయఖడ్గధరాద్విజాః, క్రీడార్థమపి యద్బ్రూయుస్సధర్మో వేదనేతరః."

టీ. వాఙ్మనసాతిభూమయే-వాఙ్మనస = మనోవాక్కు-లకు, అతిభూమయే = గోచరింపని దేవరవారికొఱకు, నమః. నమః = ప్రణామంబులు చేయుచున్నాను. వాఙ్మనసైక భూమయే-వాఙ్మనస = మనోవాక్కు-లకు, ఏకభూమయే = ముఖ్యముగా సాక్షాత్క-రించునట్టి దేవరవారికొఱకు, నమః. నమః = ప్రణామంబులఁ జేయుచున్నాను. అనన్తమహావిభూతయే - అనన్త = అపరిచ్ఛిన్నమై, మహత్ = సర్వాతిశయమైన, విభూతయే = ఉభయవిభూత్యైశ్వర్యముగల దేవరవారికొఱకు, నమః. నమః = ప్రణమిల్లుచున్నాను. అనన్తదయైకసిన్ధవే-అనన్త = నిరవధికమైన, దయా = కృపారసమునకు, ఏక = అద్వితీయమగు, సింధవే = మహార్ణవమైన దేవరవారికొఱకు, నమః. నమః = పలుమాఱు సేవించుచున్నాను.

తా. [1] బ్రహ్మరుద్రాదులకైనను స్వయత్నముచే సాక్షాత్క-రింపఁ గోరునప్పుడు వారి వాఙ్మనస్సులకున్ను గోచరింపనివాఁడవై [2] ఎంత నికృష్టులకైనను నిర్హేతుకకృపచే నీవు జూపఁదలచినప్పుడు నీదుస్వరూపరూపగుణవిభూత్యైశ్వర్యముల నున్నదియున్నట్టు సాక్షాత్క-రింపఁ జేయువాఁడవై బ్రహ్మాద్యైశ్వ

1. "యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ."

2. "యమేవైషవృణుతే తేనలభ్యః, తస్యైష ఆత్మావివృణుతేతనూం స్వాం."

ర్యముల ననుసద్భావమునొందించు నిరవధికానందావహ నిరంకుశైశ్వర్యముగలవాఁడవై పరదుఃఖాసహమగు పరిపూర్ణకృపారసమునకు నివాసభూతుఁడవై సకలజనాశ్రయణ సౌకర్యాపాదక వాత్సల్యాది కల్యాణగుణపరిపూర్ణుండవై సర్వలోకశరణ్యుండవగు నీయొక్క సర్వప్రకారాతిశయముచే జయింపంబడి హర్షముతో ననన్యార్హశేషభూతుండ నగుచున్నాను.

అవ. ఇట్లు సర్వశేషిత్వరూపభగవత్స్వరూపమును భగవదనన్యార్హశేషభూతస్వస్వరూపమును ననుసంధించి యుభయస్వరూపానుగుణమై యవిళంబఫలప్రదమగు ప్రపత్తిని ప్రయోగించుచున్నారు:—

శ్లో. నధర్మనిష్ఠోస్మి నచాత్మవేదీ
నభక్తిమాం స్త్వచ్చరణారవిన్దే,
అకిఞ్చనో ఽనన్యగతిశ్శరణ్యా
త్వత్పాదమూలం శరణమ్ప్రపద్యే. ౨౨

టీ. అహమ్ = నేను, ధర్మనిష్ఠః-ధర్మే = ధర్మమందు, నిష్ఠః = నిష్ఠగలవాఁడను, నాస్మి = కాను. ఆత్మవేదీచ = ఆత్మజ్ఞానముగలవాఁడనున్ను, నాస్మి = కాను. త్వచ్చరణారవిన్దే = తామరపుష్పములవలె భోగ్యములైన దేవరవారి శ్రీపాదములందు, భక్తిమాన్ = భక్తిగలవాఁడను, నాస్మి = కాను.

హేశరణ్య = నిరుపాధిక సర్వశేషియైన యోస్వామీ! అకిఞ్చనః = దరిద్రుఁడైన నేను, అనన్యగతిః = గత్యన్తరము లేనివాఁడనై, త్వత్పాదమూలం - త్వత్ = నీయొక్క, పాదమూలం=శ్రీపాదములను, శరణం=ఉపాయముగా, ప్రపద్యే= అధ్యవసించుచున్నాను.

తా. నీవెవరికిని స్వశక్తిఁగొని యాశ్రయింపఁదగిన విషయముగాక యాకించన్యమును ముందుంచుకొని యాశ్రయింపఁదగిన విషయమైనందున నేను కొన్ని సత్కార్యములు గలవాఁడనై యుంటినేని దనను కావలసినవి తానే చేసికొనుచున్నాఁడని నీవు చెయివిడువ వచ్చునట్టి సత్కార్యముల నొకటియు లేనివాఁడనై భగవదనన్యార్హశేషభూతాత్మస్వరూపజ్ఞానము లేనివాఁడనై నిరతిశయభోగ్యమైన దేవరవారి శ్రీపాదములందు భక్తిలేనివాఁడనై స్వరూపయాథాత్మ్యజ్ఞానసంపత్తిలేనందున దరిద్రుఁడనైన నేను వరణీయమైన రక్షకాంతరము లేనందున నిరుపాధిక సర్వశేషియైన దేవరవారి తిరువడిగళనే విరోధినివృత్తిపూర్వకమైన కైంకర్యసిద్ధికి నుపాయముగా నధ్యవసించుచున్నాను.

అవ. ఇట్లు శరణాగతిచేయఁగా మాముఖోల్లాసకరమైన సత్కార్యములు లేకున్నను స్వరూపహానికరములైన నకృత్యములు లేకుండెనేని యాథాత్మ్యజ్ఞానమును గృపఁజేసి పురుషా

ర్థము నిచ్చుచున్నామని భగవదభిప్రాయముగాగా నిషిద్ధా నుష్ఠానములచేతఁ బరిపూర్ణుఁడనై యున్నానని సాయించు చున్నారు:—

శ్లో. నని న్దితం కర్మ యద స్తిలోకే
సహస్రశోఽయన్న మయావ్యధాయి,
సోఽహం విపాకావసరే ముకున్ద
క్రన్దామిసమ్ప్రత్యగతి స్తవాగ్రే. ౨3

టీ. లోకే = ప్రపంచమందు, నిన్దితం = దూషింపఁబడిన, కర్మ=వ్యాపారము, యత్ = ఏది, అస్తి = ఉన్నదో, అయం = ఈనిన్ద్యవ్యాపారము, మయా = నాచేత, సహస్రశః = పెక్కు విధములుగా, నవ్యధాయి ఇతి న=యీరీతి చేయఁబడలేదని లేదు. (అనఁగా నకృత్యకరణములచేఁ బరిపూర్ణుఁడ ననుట.) సః=అట్టి, అహం = నేను, విపాకావసరే-విపాక = పాపపరిపాకము యొక్క, అవసరే = సమయమందు, అగతిః = రక్షకములేని వాఁడనై, హేముకున్ద = ముక్తిభోగప్రదుండగు నోస్వామీ! తవ = నీయొక్క, అగ్రే = ఎదుట, సమ్ప్రతి = ఇప్పుడు, క్రన్దామి = దుఃఖించుచున్నాను.

తా. లోకమందు నింద్యములైనఁ గ్రూరకృత్యము లెన్నికలవో వానినన్నింటిని పలు దెఱఁగుల చేసి వానికి ప్రాయశ్చిత్తములన్నెన్నక యిట్లు చేసితిమను ననుతాపమును లేక వానియొక్క ఫలకాలమందు

గత్యన్తరము లేనివాఁడై [1]సర్వశేషియై [2]నిరవధిక కృపాపరిపూర్ణుఁడవైన దేవరవారికిఁ బరిహరింపం గూడని దశనుబొందినవాఁడనై దేవరవారికెదుట మొఱపెట్టుచున్నాను.

అవ. మీయొక్క పూర్వవృత్తియిట్లుండఁగా క్రందామి యని మమ్ము ననిష్ఠురముగాఁ జెప్పుచున్నారేమని భగవదభిప్రాయ ముగాఁగా సంసారాబ్ధియందు మునుంగుచున్న నాకు నిర్హేతు కకృపచేత నీయొక్క రక్షకత్వమును దయచేసినందున నీశ్రీపా దములంబొందుటకును నిదియకారణంబని మొఱపెట్టుచున్నానని సాయించుచున్నారు:—

శ్లో. నిమజ్జతోఽనన్త భవార్ణవాన్త
శ్చిరాయ మేకూలమివాసిలబ్ధః,
త్వయాపి లబ్ధం భగవన్నిదానీ
మనుత్తమంపాత్రమిదందయాయాః. ౨౨

టీ. అనన్తభవార్ణవాన్తః-అనన్త = అన్తములేని, భవా ర్ణవ = సంసారసాగరముయొక్క, అన్తః = మధ్యమందు, నిమ జ్జతః = మునుగుచున్న, మే=నాకు, చిరాయ=బహుకాలము

1. "సపిత్రాచ పరిత్యక్త స్సురైశ్చ సమహర్షిభిః, త్రీన్ లోకాన్సమ్పరిక్రమ్య తమేవ శరణం గతః."

2. "సతం నిపతితం భూమౌ శరణ్యశ్శరణాగతం, వధా ర్హమపి కాకుస్థః కృపయా పర్యపాలయత్."

నకు, కూలమివ = దరివలె, లబ్ధః = పొందఁబడినవాఁడవు, అసి=ఐతివి. హేభగవన్ = సకలకల్యాణగుణపరిపూర్ణుఁడైన యోస్వామీ! త్వయాపి = నీచేతను, ఇదానీం = ఇప్పుడు, దయాయాః = కృపకు, అనుత్తమం = సర్వోత్కృష్టమైన, ఇదమ్ = ఈ, పాత్రం = పాత్రము, లబ్ధం = పొందఁబడెను.

తా. అపారమైన సంసారసాగరమందు మునిఁగి నశించుచుఁ దత్పరిహారంబును దెలిసికొనుటకు యోగ్యతలేని నాకు దరివలె బహుకాలమునకు లభించితివి. నిర్హేతుకకృపావాత్సల్యాదిపరిపూర్ణుఁడైన దేవరవారియొక్క యాపన్నార్తిప్రశమనమే ముఖ్య జీవనముగాఁగల దయారసమునకు పాత్రమైనవాఁడనై యసహ్యాద్యపచారములచేఁ బూర్ణుఁడైనందున దేవరవారిక్షమకు ముఖ్యవిషయమైన నన్ను నీవు లభించితివని తాత్పర్యము.

అవ. ఇట్లు గత్యంతరములేనివాఁడనై దేవరవారియొక్క కృపైకరక్షకత్వముగలవాఁడనని మాయందున్యస్తభరులైన మీరు స్వామి దనసొత్తును నేవిధమైనను చేసికొనియెదునని యుండుట స్వరూపమైయుండగా నిట్లు నిర్బంధించుటేమని భగవంతుని కభిప్రాయముగాఁగా నాయొక్క యనర్థములను నివర్తింపఁజేయుమని ప్రార్థించువాఁడవుగాను ఆశ్రితులకువచ్చు పరిభవంబు రక్షకుఁడైన దేవరవారియొక్క ప్రభావంబునకు సంకోచకరమనుదానిని విన్నపంబు జేయుచున్నానని సాయించుచున్నారు:—

శ్లో. అభూతపూర్వం మమభావి కింవా
సర్వం సహే మే సహజం హి దుఃఖం,
కిన్తుత్వదగ్రే శరణాగతానాం
పరాభవోనాథ న తే ఽనురూపః. ౨౫

టీ. మమ = నాకు, అభూతపూర్వం = ముందుగలుగనిదై, భావి=కాగల, కింవా=దేనినైనను, సర్వం=సమస్తమును, సహే = ఓర్చుచున్నాను. మే=నాకు, దుఃఖం = వ్యసనము, సహజంహి = స్వాభావికముగదా! కిన్తు = మఱేమనిన, నాథ= సర్వరక్షకుఁడైన యోస్వామీ! త్వదగ్రే = నీకెదుట, శరణాగతానాం = ఆశ్రితులైనవారికి, పరాభవః = అవమానము, తే = నీకు, అనురూపః = తగినది, న = కాదు.

తా. అనాదికాలమునుండి నరకగర్భవాసజననమరణాదులే యాత్రగానున్న నాకు దుఃఖానుభవంబు స్వాభావికంబు గనుక నింతవఱకనుభవించనట్టి మహాపరిభవము లేవివచ్చిన ననుభవించెదనైనను వారికి విషయప్రాణ్యంబువలనఁ గలుగునట్టి పరిభవముదగనిదై దేవరవారియొక్క తేజస్సునకు హానికరమై యుండుననుట.

అవ. నిరుపాధికశేషియైన దేవరవారికి రక్షణాభావంబువలన సిద్ధించు తేజోహానినిఁ జూచుట నోవక నన్నుం దిగనాడిన నేనువిడువనని దమయొక్క మహావిశ్వాసమును సాయించుచున్నారు:—

శ్లో. నిరాసకస్యాపి నతావదుత్సహే
మహేశహాతుం తవపాదపఙ్కజమ్,
రుషానిరస్తోఽపి శిశు_స్తనన్ధయో
నజాతుమాతుశ్చరణౌజిహాసతి. ౨౬

టీ. హేమహేశ = సర్వరక్షకుఁడైనయోస్వామీ! నిరాసకస్యాపి = త్రోసివేయువాఁడవైనను, తవ = దేవరవారి యొక్క, పాదపంకజం = తామరపుష్పములవంటి శ్రీపాదములను, హాతుం = విడుచుటకు, నోత్సహే = ఇచ్ఛయింపను. స్తనన్ధయః = పాలుగుడుచునట్టి, శిశుః = బిడ్డ, రుషా=రోషముచేత, నిరస్తోపి = త్రోయఁబడినను, మాతుః = తల్లియొక్క, చరణౌ = పాదములను, జాతు = ఒకప్పుడును, నజిహాసతి = విడువనిచ్ఛయింపదు.

తా. స్వరక్షణమందు శ_క్తిలేనిదై _స్తన్యమేధారకపోషకభోగ్యములుగానుండు శిశువు తన్ను దల్లి రోషంబువలనఁ గాలితోఁ దన్ని త్రోసినను నాతల్లిని విడువనిరీతిగా సర్వరక్షకులై నిర్హేతుకకృపాపరిపూర్ణులైన దేవరవారు నిర్దయులై త్రోసివేసినను రక్షకంబులై ప్రాప్తంబులై భోగ్యంబులైన మీ శ్రీపాదములను విడువనని భావము.

అవ. నేను రక్షకాంతరాభావముచే విడవకుండుటేగాదు. దేవరవారియొక్క భోగ్యతాతిశయమందు_మగ్నమైన

మనస్సు వేఱొక విషయమందుఁ బ్రవేశింపదని సూచించు చున్నారు:—

శ్లో. తవామృతస్యన్దిని పాదపఙ్కజే
నివేశితాత్మా కథమన్యదిచ్ఛతి,
స్థితేఽరవిన్దే మకరన్దనిర్భరే
మధువ్రతో నేక్షురకం హి వీక్షతే. ౨౭

టీ. తవ = దేవరవారియొక్క, అమృతస్యన్దిని = అమృతమును స్రవించుచున్న, పాదపఙ్కజే = తామరపుష్పముల వంటి తిరువడిగళందు, నివేశితాత్మా - నివేశిత=ఉంచఁబడిన, ఆత్మా = మనస్సు, కథం = ఏలాగు, అన్యత్ = ఇతరమును, ఇచ్ఛతి = కోరుచున్నది. మకరన్దనిర్భరే = తేనెచేతఁ బరిపూర్ణమైన, అరవిన్దే = తామరసపుష్పము, స్థితేసతి = ఉండఁగా, మధువ్రతః = తుమ్మెద, ఇక్షురకం = నీరుగొబ్బి పువ్వును, నవీక్షతే హి = కంటనున్ను జూడదుగదా.

తా. మకరందమే జీవనముగాఁగల తుమ్మెద మకరంద ప్రవాహముగలదై భోక్తలైనవారికి సిద్ధముగా నుండెడు దామరసపుష్పంబునువదలి గంధశూన్యమై సమీపించినవాటిని బాధించునట్టి ముండ్లచేత నిండియున్న నీరుగొబ్బిపువ్వును సమీపించనట్టువలె [1]మకరందప్రవాహోత్పత్తిస్థానమై ప్రాప్య

1. "విష్ణోః పదే పరమేమధ్వ ఉత్సః."

మైన దేవరవారి శ్రీపాదములనులభించి నిరతిశయ భోగ్యత ననుభవింపుచు మహానందమును బొందు చున్న నేను హేయంబులై స్వరూపానర్హంబులై నాశహేతువులైన విషయంబుల నేలాగునఁ బొంద నిచ్ఛయింతునని తాత్పర్యము.

అవ. మీరు చేసిన ప్రపత్తినాయొక్క యనిష్టనివృత్తి కిని యిష్టప్రాప్తికిని సమర్థమై చేసియుండునా యని భగవదభి ప్రాయముగాఁగా "బద్ధాంజలిపుటందీనం యాచన్తంశరణాగత" మని కాయికమైన యంజలిమాత్రమే పురుషార్థమునకుఁ జాలు నని సాయించుచున్నారు:—

శ్లో. త్వదఙ్ఘ్రిముద్దిశ్య కదాపి కేనచి
ద్యథాతథావాపి సకృత్కృతో౽ంజలిః,
తదైవ ముష్ణాత్యశుభాన్యశేషత
శ్శుభాని పుష్ణాతి నజాతుహీయతే. ౨౮

టీ. త్వదఙ్ఘ్రిం = దేవరవారితిరువడిగళను, ఉద్దిశ్య = ఉద్దేశించి, కదాపి = ఎప్పుడైనను, కేనచిత్ = ఎవనిచేతనైన, యథాతథావాపి = ఏప్రకారముగానైనను, సకృత్ = ఒకా నొకప్పుడు, కృతః=చేయఁబడిన, అఞ్జలిః = కాయికమాత్రము చేతఁ జేయఁబడునంజలి, తదైవ = అప్పుడే, అశేషతః=సమస్త మైన, అశుభాని = పురుషార్థప్రతిబంధకములను, ముష్ణాతి = నశింపఁజేయుచున్నది. శుభాని = అభిమతములను, పుష్ణాతి =

అతిశయింపఁజేయుచున్నది. జాతు = ఒకప్పుడును, నహీయతే = తక్కువఁబడదు.

తా. నిరుపాధికశేషియగు దేవరవారియొక్క నిరతిశయభోగ్యంబై సర్వసులభమై ప్రాప్యప్రాపకంబులైన తిరువడిగళయందు జేయఁబడునంజలి జ్యోతిష్టోమాదులవలె వసన్తర్తు శుక్లపక్షపూర్వాహ్ణాది నియమములుగలదిగాక యిచ్ఛగలిగినప్పుడు జేయఁదగినదై త్రైవర్ణికత్వగృహమేధిత్వ కృష్ణకేశిత్వాద్యధికార విశేషనియమంబు గలదిగాక సర్వాధికారమై శాస్త్రవిహితాంగోపాంగసహితంబులగు కర్మంబులవలెగాక కరణత్రయానన్యతమానుష్ఠేయమై యావజ్జీవానుష్ఠేయ నిత్యకర్మములవలెగాక యేకవారానుష్ఠేయంబై జాయాదిసహాకృతాశ్వమేధాదులవలె దుష్కరంబుగాక సుకరంబైనదై దేశాంతరమందు కాలాంతరమందు దేహాంతరమందు ఫలప్రదంబులగు సాధనాన్తరములవలెగాక జేయఁబడునప్పుడే ప్రాప్యప్రతిబంధకములైన సమస్తపాపంబులను,పోయినదోవ తెలియకుండునట్లుగా నపహరించునదై పరభక్తి పరజ్ఞాన పరమభక్తి దేశవిశేషప్రాప్తి భగవత్కైంకర్య పర్యన్తంబులైన సమస్తాభీష్టములను గృపఁజేయుచు ఫలప్రదానము జేసి క్షీణించు కర్మాదుల

వలెగాక [1]యీశ్వరహృదయమందు నెప్పుడు కొదువ లేక యుండును.

అవ. దేవరవారు పరమసుఖమునుఁ గృపఁజేయుట కాయాసాత్మకమైన గాయికమగు నంజలియు కావలెనా? మానసికమాత్రమే చాలునని సాయించుచున్నారు:—

శ్లో. ఉదీర్ణసంసారదవాశుశుక్షణిం
క్షణేన నిర్వాప్య పరాఞ్చనిర్వృతిమ్,
ప్రయచ్ఛతిత్వచ్చరణారుణామ్బుజ
ద్వయానురాగామృతసిన్ధుశీకరః. ౨౯

టీ. త్వచ్చరణారుణామ్బుజ ద్వయానురాగామృత సిన్ధుశీకరః-త్వత్ = దేవరవారియొక్క, చరణ = శ్రీపాదములను, అరుణామ్బుజ=ఎఱ్ఱదామరలయొక్క, ద్వయ = యుగళమందు, అనురాగ = భక్తియను, అమృతసిన్ధు=క్షీరసముద్రముయొక్క, శీకరః = తుంపురు, ఉదీర్ణసంసారదవాశుశుక్షణిం - ఉదీర్ణ = ఉద్రేకించిన, సంసార = సంసృతియనే, దవాశుశుక్షణిం = కాఱుచిచ్చును, క్షణేన = క్షణకాలములో, నిర్వాప్య = చల్లార్చి, పరాం = సర్వోత్కృష్టమైన, నిర్వృతిఞ్చ = పరమపదమందలి పరమసౌఖ్యమునున్ను, ప్రయచ్ఛతి = ఇచ్చుచున్నది.

---

1. "గోవిందేతి యదాక్రందత్కృష్ణామాం దూరవాసినం,
ఋణం ప్రవృద్ధ మివమే హృదయాన్నాపసర్పతి."

తా. నిరుపాధికశేషియై సర్వసులభుండవైన దేవరవారియొక్క సౌందర్యసీమాభూమియై నిరతిశయభోగ్యంబైన తిరువడిగళయందుఁ బ్రేమయనే క్షీరసముద్రముయొక్క యొకతుంపురు ఉద్రేకించినదై యదాహ్యమైన నాత్మద్రవ్యమును దహింపఁజేయు దానివలెనున్న సంసారమను కారుచిచ్చును చల్లార్చి పరమపదమందు నిరవధికానందనిర్భరంబగు స్థితిని నొసఁగుచున్నది.

అవ. ఇట్లు శీఘ్రకాలఫలప్రదంబైన సిద్ధోపాయమును స్వీకరించినవారగుటచేఁ గ్రమప్రాప్తినిసహింపక త్వరప్రేరేపింప దేవరవారి తిరువడిగళను నేనెప్పుడు సేవింతునని దీనులై ప్రార్థించుచున్నారు:—

శ్లో. విలాసవిక్రాన్త పరావరాలయం
నమస్యదార్తి క్షపణే కృతక్షణమ్,
ధనమ్మదీయ న్తవపాదపఙ్కజం
కదానుసాక్షాత్కరవాణిచక్షుషా. 30

టీ. విలాసవిక్రాన్తపరావరాలయం-విలాస = లీలచేత, విక్రాన్త = ఆక్రమింపఁబడిన, పర = అతిశయులైన దేవతలయొక్క, అవర = మనుష్యాదులయొక్క, ఆలయం = స్థానములైన స్వర్గలోక భూలోకములుగలదియును, నమస్యదార్తి క్షపణే - నమస్యత్ = ఆశ్రితులయొక్క, ఆర్తి=దుఃఖముల

యొక్క, క్షపణే = నివారించుటయందు, కృతక్షణం-కృత= చేయఁబడిన, క్షణం = ఉత్సవముగలదియు, మదీయం = నా సంబంధియైన, ధనం = ద్రవ్యమైన, తవ = నీయొక్క, పాద పంకజం = తామరపుష్పములవంటి శ్రీపాదములను, చక్షుషా= నేత్రములచేత, కదాను = ఎప్పుడు, సాక్షాత్కరవాణి=సాక్షా త్కరింతును.

తా. ఉత్కృష్టులైన బ్రహ్మేంద్రాదులలోకంబుల నాక్రమించి వారలకు సేవసాయించి యీప్రకారమే భూలోకమందును వసిష్ఠచండాల విభాగములేక సమస్తమైన వారిశిరస్సులయందును వారపేక్షింపకున్నను తానే విలాసముగా వ్యాపించినదై సేవను గృపఁజేసి యిట్లు త్రివిక్రమావతారమం దుపకరించుటయేగాక యాశ్రితుల యాపన్నివారణమే తనకు ధారకపోషక భోగ్యములుగా గలదై యస్మదాదులకు నిక్షేపంబై నిరతిశయభోగ్యంబున దేవరవారి శ్రీపాదద్వయమును కన్నుల పండువుగా నెప్పుడు సేవించి యానందింతునో.

అవ. ఈశ్లోకమం దనాశ్రితులనున్ను మీదుఁబడి యాశ్రయించునటుల జేయునట్టి నిరవధికసౌందర్యముగల శ్రీ పాదములను నేత్రములచే సేవించుటమాత్రము చాలదు. అట్టి తిరువడిగళు నాశిరస్సును అలంకరించవలయునని ప్రార్థించు చున్నారు:—

శ్లో. కదాపునశ్శఙ్ఖరథాఙ్గకల్పక
ధ్వజారవిన్దాఙ్కుశవజ్రలాఞ్ఛనమ్,
త్రివిక్రమత్వచ్చరణామ్బుజద్వయం
మదీయమూర్ధానమలఙ్కరిష్యతి. 31

టీ. హే త్రివిక్రమ = మూఁడడుగులచే బ్రహ్మాండమును గొలిచిన యో స్వామీ! శఙ్ఖరథాఙ్గకల్పకధ్వజారవిన్దాఙ్కుశవజ్రలాఞ్ఛనం-శఙ్ఖ = పాఞ్చజన్యము, రథాఙ్గ = చక్రము, కల్పక = కల్పవృక్షము, ధ్వజ=టెక్కెము, అరవిన్ద = తామరపుష్పము, అఙ్కుశ = అంకుశము, వజ్ర = వజ్రాయుధమే, లాఞ్ఛనమ్=చిహ్నముగాఁగల, త్వచ్చరణామ్బుజద్వయం-త్వత్ = దేవరవారియొక్క, చరణామ్బుజ = తామరపుష్పములవంటి తిరువడిగళులయొక్క, ద్వయం=యుగళము, మదీయమూర్ధానం-మదీయ = నాసంబంధియైన, మూర్ధానం=శిరసును, కదాపునః= ఎప్పుడు, అలఙ్కరిష్యతి = అలంకరింపఁగలదు.

తా. గుణాగుణనిరూపణము జేయక ప్రత్యుపకారమును గణింపక వారలప్రార్థన నభిలషింపక శ్రీపాదములయొక్క వైలక్షణ్యమును నాలోచింపక వసిష్ఠచండాలవిభాగము లేక యందరిశిరములందు తిరువడిగళనుంచిన నిరవధికవాత్సల్యకృపాపరిపూర్ణులైన దేవరవారియొక్క యుభయవిభూతినాయకత్వలక్షణములుగలదై పండిత పామర సాధారణముగా

సర్వజనాకర్షకమగు సౌందర్యము గలదై సర్వసుల
భమై ప్రాప్యప్రాపకమైన శ్రీపాదద్వయము నరక
హేతువులైన నీచవిషయములయొక్క కాళ్లను వేడు
కొనుచు విషయాంతరమగ్నుఁడైన నాదుశిరము
నెప్పుడలంకరించి యానందింపఁజేయునో యని
భావము.

అవ. ఇట్లు శ్రీపాదములను ప్రార్థింపుచున్న వీరికి సము
దాయశోభసాక్షాత్కరింపఁగా నాసౌందర్యమందు మోహించి
యీశ్లోకముమొదలు 'భవన్తమేవ' యను శ్లోకపర్యన్తము
పర్యఙ్కక్రమముగా నవయవాభరణాయుధమహిషీపరిజనంబుల
యొక్క చేరికవలనగలిగిన సౌందర్యాతిశయము ననుభవింపుచు
తదనుభవజనిత ప్రీతికారిత కైంకర్యముచేత నిన్నెప్పు డానం
దింపఁజేయుదునో యని సాయించుచున్నారు:—

శ్లో. విరాజమానోజ్వలపీతవాససం
స్మితాతసీసూనసమామలచ్ఛవిమ్,
నిమగ్ననాభిం తనుమధ్యమున్నతం
విశాలవక్షస్థలశోభిలక్షణమ్. 32

టీ. విరాజమానోజ్వలపీతవాససం - విరాజమాన =
ప్రకాశింపుచున్నదై, ఉజ్వల = నిరవధికతేజస్సంపన్నమైన,
పీతవాససం = పీతాంబరముగలవాఁడును, స్మితాతసీసూనసమా
మలచ్ఛవిం - స్మిత=వికసించిన, అతసీసూన = నల్లగిసెపూవుతో,

సమ = సదృశమై, అమల = నిర్మలమైన, చ్ఛవిం = కాంతిగల వాఁడును, నిమగ్ననాభిం - నిమగ్న = అగాధమైన, నాభిం = పొక్కిలిగలవాఁడును, తనుమధ్యం = సూక్ష్మమైననడుముగల వాఁడును, ఉన్నతం = సర్వాధికుఁడైనవాఁడును, విశాలవక్షస్థల శోభిలక్షణం - విశాల = వెడదయైన, వక్షస్థల = రొమ్మునందు, శోభి = ప్రకాశింపుచున్న, లక్షణం = శ్రీవత్సమనే చిహ్నము గలవాఁడును.

తా. ప్రకాశించుచున్నదై నిరవధికతేజస్సంపన్నమై స్వర్ణమయమైన పీతాంబరముచే బ్రకాశించెడు కటిప్రదేశము వికసించిన నల్లయగిసెపువ్వుడాలులఁబోలు దివ్యమంగళవిగ్రహము, సౌందర్యప్రవాహముయొక్క సుడిగా ప్రకాశింపుచున్న నాభియు అతిసూక్ష్మమైన మధ్యము ఇట్టి దివ్యావయవసౌందర్యమును సాఫల్యము నొందించుచున్న వాత్సల్యసౌశీల్యాది కల్యాణగుణైకతానత్వముచేత నైన సర్వాతిశాయిత్వము అతివిశాలమైన వక్షస్థలమునం దొప్పుచున్న శ్రీవత్సమను చిహ్నము ఇవి మొదలైనవానిచే నాశ్రితులయొక్క నేత్రముల నానందసాగరమునందు ముంచుచున్న వాఁడవని తాత్పర్యము.

అవ. ఆశ్రితులయొక్క యిష్టానిష్టప్రాప్తిపరిహారములనుఁ జేయుచున్నవై శౌర్యవీర్యసౌందర్యాతిశయములుగల దివ్య భుజముల ననుభవింపుచున్నారు:—

శ్లో. చకాసతంజ్యాకిణకర్కశైశ్శుభై
శ్చతుర్భిరాజానువిళమ్బిభిర్భుజైః,
ప్రియావతంసోత్పలకర్ణభూషణ
శ్లథాలకాబన్ధవిమర్దశంసిభిః. 33

టీ. జ్యాకిణకర్కశైః - జ్యా=నారియొక్క, కిణ = గాయములచేత, కర్కశైః = కఠినములైనవియు, శుభైః = ప్రకాశింపుచున్నవియును, చతుర్భిః = నాలుగైనవియును, ఆజానువిళమ్బిభిః = జానువులపర్యంతము వ్రేలుచున్నవియును, ప్రియావతంసోత్పలకర్ణభూషణశ్లథాలకాబంధవిమర్దశంసిభిః - ప్రియా = పిరాట్టియొక్క, అవతంస = శిరోభూషణమైన, ఉత్పల = కలువపువ్వుయొక్క, కర్ణభూషణ = కర్ణాభరణముల యొక్క, శ్లథ=జారిన, అలక = ముంగురులయొక్క, ఆబన్ధ= కట్టుటచేతనైన, విమర్ద = సంమర్దమును, శంసిభిః = చెప్పు చున్న, భుజైః =బాహువులచేత, చకాసతం = ప్రకాశింపు చున్నవాఁడును.

తా. ఆశ్రితుల యాపన్నివారణమే జీవనము గాఁగలవై శ్రీశార్ఙ్గముయొక్క జ్యాఘాతరేఖలచేఁ బ్రకాశింపుచున్నవై సర్వలక్షణలక్షితములై పెఁ

యపిరాట్టికి శిరోభూషణమైన పుష్పమును సవరిం చుటవల్లనున్ను నాభరణముల నలంకరించుటవల్ల నున్ను లలాటమందు వ్రేలుచున్న ముంగురులను మీఁదికెత్తి దువ్వి చక్కచేయుటవల్లనున్ను గలి గిన సంమర్దముల నాశ్రితుల కనుభవింపఁజేయు చున్నవై చతుస్సంఖ్యాకములైన దివ్యబాహువు లచేఁ బ్రకాశింపుచున్నాఁడని తాత్పర్యము.

అవ. ఇట్లు బాహుసౌందర్యము ననుభవించి యా సౌందర్యాబ్ధియందుత్పన్నమైన శంఖమువలెనున్న కంఠము నున్ను ముఖమండలముయొక్క సామాన్యశోభనున్ననుభవించు చున్నారు:—

శ్లో. ఉదగ్రపీనాంసవిలమ్బికుణ్డలా
లకావళీబన్ధురకమ్బుకన్ధరమ్,
ముఖశ్రియాన్యక్కృతపూర్ణనిర్మలా
మృతాంశుబిమ్బామ్బురుహోజ్జ్వలశ్రియమ్. 3ర

టీ. ఉదగ్రపీనాంసవిలమ్బికుణ్డలాలకావళీబన్ధురకమ్బు కన్ధరం-ఉదగ్ర = ఉన్నతములై, పీన = స్థూలములైన, అంస= భుజశిరస్సులందు, విలమ్బి = వ్రేలుచున్న, కుణ్డల = కర్ణాభరణ ములతో, అలక = ముంగురులయొక్క, ఆవళి = శ్రేణితో, బన్ధుర = కూడుకొన్న, కమ్బుకన్ధరమ్ = రేఖాత్రయముచేఁ బ్రకాశింపుచున్న కంఠముగలవాఁడును, ముఖశ్రియా = ముఖ

మండల కాన్తిచేత, న్యక్కృత పూర్ణనిర్మలామృతాంశుబిమ్బా మ్బురుహోజ్జ్వలశ్రియం - న్యక్కృత = తిరస్కరింపఁబడిన, పూర్ణ = సంపూర్ణమైనదియు, నిర్మల = కలంకరహితమైన, అమృతాంశుబిమ్బ = చంద్రబింబముయొక్క, అమ్బురుహ = తామరసపుష్పముయొక్క, ఉజ్జ్వల=ప్రకాశింపుచున్న, శ్రియం = కాంతిగలవాఁడును.

తా. కల్పవృక్షశాఖలవలె వృత్తములై దీర్ఘములై స్థూలములైన భుజములయందు నృత్యము జేయుచున్న మణిమయ మకరకుండలాదులచేతను చఞ్చరీకసఞ్చయ సముదఞ్చదదభ్రవిభ్రమవిలాసాను కారులగు ముంగురులచేత నొప్పుచున్నదై [1]రేఖాత్రయవిరాజమానమైనకణ్ఠముచేఁ బ్రకాశించుచున్నవాఁడును ప్రసాదాహ్లాదకత్వాదులచే కళంకరహితుఁడై షోడశకళాపరిపూర్ణుఁడైన చంద్రుని తిరస్కరించునదై సౌందర్య సౌకుమార్యాదులచే మానస సరోజాతసరోరుహమును బరిహసించెడు ముఖమండల దివ్యతేజస్సును గలవాఁడని తాత్పర్యము.

అవ. ఇట్లు వదనసరోరుహ సామాన్యతేజ మనుభవించి యీశ్లోకమందు తత్తదవయవ సన్నివేశ సౌందర్యము ననుభవించుచున్నారు:—

1. "రేఖాత్రయాంకితా గ్రీవా కంబుగ్రీవేతికథ్యతే."

శ్లో. ప్రబుద్ధముగ్ధాంబుజచారులోచనం
సవిభ్రమభ్రూలతముజ్జ్వలాధరమ్,
శుచిస్మితం కోమలగణ్డమున్నసం
లలాటపర్యన్త విలమ్బితాలకమ్. 38

టీ. ప్రబుద్ధముగ్ధాంబుజచారులోచనమ్ - ప్రబుద్ధ = వికసించినదై, ముగ్ధ = నూతనమైన, అమ్బుజ = తామరపువ్వువలె, చారు = సుందరములైన, లోచనం = నేత్రములు గలవాఁడును, సవిభ్రమభ్రూలతం-సవిభ్రమ=విలాసములతోఁ గూడిన, భ్రూలతం = తీఁగెలవంటి కనుబొమలుగలవాఁడును, ఉజ్జ్వలాధరం - ఉజ్జ్వల = ప్రకాశింపుచున్న, అధరం = పెదవిగలవాఁడును, శుచిస్మితం - శుచి = పరిశుద్ధమైన, స్మితం = చిరునవ్వుగలవాఁడును, కోమలగండం - కోమల = మృదువులయిన, గండం = చెక్కిళ్లుగలవాఁడును, ఉన్నసం = ఉన్నతనాసికముగలవాఁడును, లలాటపర్యన్తవిలమ్బితాలకం - లలాటపర్యన్త=నుదురుదాక, విలమ్బిత = వ్రేలుచున్న, అలకం= ముంగురులు గలవాఁడును.

తా. అప్పుడు వికసించినవై సుందరములైన తామరలను బోలు విలోచనంబులు శ్రీశార్ఙ్గము వలె వలయములై దీర్ఘంబులైన కనుబొమలు దొండపండువంటి యధరంబు కుందకుసుమ సందోహ భాసురంబైన చిరునవ్వు మణిదర్పణవిలాసనిరాసక

ములగు కపోలంబులు తిలకుసుమభాసమాన నాసా పుటంబు వక్షాసమయ కాదమ్బినీడమ్బరవిడమ్బకము లై లలాటఫలకమందు దిగుగులాడుచున్న చూర్ణకుంతలంబులు మొదలయినవానిచే ననాశ్రితుల నభిముఖులనుగాఁ జేయునట్టి చాతుర్యముగల నీ ముఖమండల సౌందర్యంబుచేఁ బ్రకాశించువాఁడని తాత్పర్యము.

అవ. తిరుముఖమండల సౌందర్యమనుభవించి యీశ్లోకమం దాభరణాయుధాదుల చేరికవలనఁ గలిగియుండు దివ్య తేజోవిశేష మనుభవించుచున్నారు:—

శ్లో. స్ఫురత్కిరీటాఙ్గదహారకణ్ఠికా
మణీన్ద్రకాఞ్చీగుణనూపురాదిభిః,
రథాఙ్గశఙ్ఖాసిగదాధనుర్వరై
ర్లసత్తులస్యావనమాలయోజ్జ్వలమ్. 3౬

టీ. స్ఫురత్కిరీటాఙ్గదహారకణ్ఠికామణీన్ద్రకాఞ్చీ గుణ నూపురాదిభిః - స్ఫురత్ = ప్రకాశింపుచున్న, కిరీట = ముకుటము, అఙ్గద = కేయూరములు, హార = ముత్యాలహారములు, కణ్ఠికా = గ్రైవేయము, మణీన్ద్ర = కౌస్తుభము, కాఞ్చీగుణ = మొలనూలు, నూపుర = అందెలు, ఆదిభిః=మొదలైనవానిచేత, రథాఙ్గశఙ్ఖాసిగదాధనుర్వరైః - రథాఙ్గ=చక్రముచేత, శంఖ = పాఞ్చజన్యముచేత, అసి = ఖడ్గముచేత, గదా = గదచేత,

ధనుర్వరైః = ధనుశ్శ్రేష్ఠమైనశార్ఙ్గముచేత, లసత్తులస్యా - లసత్ = ప్రకాశింపుచున్న, తులస్యా = తులసిగల, వనమాలయా = వైజయంతీమాలికచేత, ఉజ్వలం = ప్రకాశింపుచున్నవాఁడును.

తా. ఉభయవిభూతినాయకత్వసూచకమై యుత్తమాంగమునఁ బ్రకాశింపుచుండు కిరీటము సర్వోపాశ్రయములైన బాహువులందు విలసిల్లు కేయూరములు వక్షస్థలము నాశ్రయించి ప్రకాశించెడు ముత్యాలహారములును కమ్బుగ్రీవమందుఁ దేజరిల్లు గ్రైవేయములును దానికిన్ననవరతము స్పృహణీయమైన శ్రీకౌస్తుభమణి కటిప్రదేశముతో సఖ్యమొనర్చు కాంచీదామంబు సతతమును చరణసరోరుహము నాశ్రయించి భాసిల్లునందెలు మొదలైన దివ్యాభరణములచేత నీయాభరణములతో సమములై యాశ్రితుల కిష్టానిష్ట ప్రాప్తిపరిహారకంబులైన శంఖచక్రగదాసిశార్ఙ్గముఖ్య దివ్యాయుధములచేతను నిష్యందమకరంద సందోహ సమూహాతేందిందిర ఝుంకారసంకులమనోహర తులసీదళవిరాజమాన వైజయంతీమాలికచేతనున్ను గలిగిన దివ్యతేజో విశేషంబుచే దేదీప్యమానుండని తాత్పర్యము.

అవ. ఇట్లు సర్వేశ్వరుని నిరవధికైశ్వర్యసౌందర్య లావణ్యాదుల ననుభవించి వీనికన్నింటికి మూలకారణమగు పిరాట్టితో సంశ్లేష వైభవమును రెండుశ్లోకంబులచే ననుభవించువారై మొదటిశ్లోకమందు పిరాట్టియెడ నీశ్వరునికిఁ గలిగియుండు వ్యామోహాధిక్యమును సాయించుచున్నారు:—

శ్లో. చకర్థ యస్యా భవనం భుజాన్తరం
తవ ప్రియం ధామ యదీయ జన్మభూః,
జగత్సమస్తం యదపాఙ్గ సంశ్రయం
యదర్థ మమ్భోధిరమన్థ్యబన్ధిచ. 38

టీ. యస్యాః = ఏపిరాట్టికి, భుజాన్తరం = వక్షస్థలమును, భవనం = కేళీగృహమునుగా, చకర్థ = చేసితివో, యదీయజన్మభూః=ఏపిరాట్టికి జన్మస్థానమైన పాలసముద్రము, తవ = నీకు, ప్రియం = అభీష్టమైన, ధామ = స్థానమైనదో, సమస్తం=సకలమైన, జగత్=లోకము, యదపాఙ్గసంశ్రయం - యత్ =ఏపిరాట్టియొక్క, అపాఙ్గ=కటాక్షమే, సంశ్రయం= ఆధారముగాగలదో, అమ్భోధిః = సముద్రము, యదర్థం = ఏపిరాట్టినిమిత్తమై, అమన్థి = మథింపంబడెనో, అబన్ధిచ = బంధింపబడెనో.

తా. ఏపిరాట్టికి సర్వయజ్ఞమయమైన మేనువందు నురమును కేళికాగృహమును జేసితివో ఉభయవిభూతినాయకుండైన నీకే పిరాట్టి యవతార

స్థానమగు క్షీరసముద్రం బభిమత నివాసస్థలమై యున్నదో సకలలోకము సర్వజగన్మాతయగు యే పిరాట్టియొక్క కటాక్షము నాధారముగా గలదై యున్నదో ఏపిరాట్టిని లభించుటకై సముద్రము జిలుకఁబడినదో సేతుబంధమును జేయంబడెనో.

అవ. ఇట్లు పెరాట్టియందలి యీశ్వరునకుఁగలిగియుండు వ్యామోహాతిశయ మనుసంధించి యీశ్లోకమున వానికి నా పెరాట్టి యనురూపయైయుండుట ననుభవించుచున్నారు:—

శ్లో. స్వవైశ్వరూప్యేణ సదానుభూతయా
ప్యపూర్వవద్విస్మయమాతతానయా,
గుణేన రూపేణ విలాసచేష్టితై
స్సదాతవైవోచితయాతవశ్రియా. 30

టీ. స్వవైశ్వరూప్యేణ - స్వ = తనయొక్క, వైశ్వరూప్యేణ = విశ్వరూపాకారముతో, సదా = ఎల్లప్పుడు, అనుభూతయాపి = అనుభవింపఁ బడుచున్నదైనను, అపూర్వవత్ = నూతనమైన దానివలె, విస్మయం=ఆశ్చర్యమును, ఆతతానయా = విస్తరింపచేయుచున్నదియు, గుణేన = శీలాదిగుణములచేత, రూపేణ = సౌందర్యముచేత, విలాసచేష్టితైః = శృఙ్గారచేష్టలచేతనున్న, సదా = ఎల్లప్పుడు, తవైవ = నీకే, ఉచితయా = దాసురాలైనదియు, తవ=నీకు, శ్రియా = అనన్యార్హశేషభూతురాలైనదియును.

తా. నిత్యసూరులు మిథునవిషయమం దనేక శరీరపరిగ్రహముఁజేసి నానావిధకైంకర్యములఁ జేయుచుండియుఁ దృప్తిఁబొందనట్టువలె నీశ్వరునిచేఁ దన విశ్వరూపముతో ననుభవింపంబడుచున్నను భోగ్యతాతిశయముచే నపూర్వమైన దానివలెఁ దృప్తిని బొందింపనదియును [1]శీలవృత్తాదులచే నీశ్వరునికి సదృశులై భగవదనన్యార్హశేషభూతురా లని తాత్పర్యము.

అవ. పిరాట్టి వైభవాతిశయము ననుసంధించి పర్యంకవిద్యయందు జెప్పియున్న ప్రకారము ఆదిశేషునియందు ఆ పిరాట్టితోఁగూడి వేంచేసియుండు సౌందర్యాతిశయము ననుభవించుచున్నారు:—

శ్లో. తయాసహాసీనమనంతభోగిని
ప్రకృష్టవిజ్ఞానబలైకధామని,
ఫణామణివ్రాత మయూఖమణ్డల
ప్రకాశమానోదరదివ్యధామని. 38

టీ. ప్రకృష్టవిజ్ఞానబలైకధామని - ప్రకృష్ట = సర్వోత్కృష్టమైన, విజ్ఞానబల = జ్ఞానబలములకు, ఏకధామని = ముఖ్యస్థానమైన వాఁడుచు, ఫణామణివ్రాతమయూఖమణ్డల

1. ''తుల్యశీలవయోవృత్తాం తుల్యాభిజనలక్షణాం,
రాఘవోర్హతివై దేహీం తంచేయ మసితేక్షణా.

ప్రకాశమానోదరదివ్యధామని - ఫణా = పడగలయందు, మణి = మాణిక్యములయొక్క, వ్రాత = సమూహముయొక్క, మయూఖ = కాంతులయొక్క, మణ్డల = సమూహములచే, ప్రకాశమాన = విలసిల్లుచున్న, ఉదర = మధ్యప్రదేశముగల, దివ్యధామని = దివ్యాన్తఃపురముగల, అనన్తభోగిని = ఆదిశేషుని యందు, తయా సహ = పూర్వోక్తవైభవముతోఁగూడిన పిరాట్టితోఁగూడా, ఆసీనం = వేంచేసియున్నవాఁడును.

తా. శ్రీ శ్రియఃపతులయొక్క సౌకుమార్యా దుల కనుగుణములైన శైత్యసౌరభ్యమార్దవములు గల విగ్రహముగలవాఁడై సర్వోత్కృష్టములైన జ్ఞానబలముల కావాసభూతుఁడై తనయొక్క ఫణా సహస్రమందు విలసిల్లు మాణిక్యసమూహముల యొక్క కాంతులచేఁ బ్రకాశింపఁజేయఁబడిన దివ్యా న్తఃపురముగలవాఁడై సర్వేశ్వరత్వమునకు ముఖ్య లక్షణభూతుఁడైన యాదిశేషునియందు [1]పిరాట్టి తోఁకూడి వేంచేసియున్నవాఁడై నిత్యముక్తులు పరి వేష్టించి సమస్తవిధకైంకర్యములు సలుపగాఁ బరిపూ ర్ణానంద మనుభవింపుచున్నవాఁడని తాత్పర్యము.

అవ. ఇట్లు సంశ్లేషసౌభాగ్యమనుభవించి యాశేషుని వృత్తి విశేషముల నీ శ్లోకమం దనుభవించుచున్నారు:—

---

1. "వైకుంఠేతు పరేలోకే శ్రియాసార్ధం జగత్పతిః,
ఆస్తే విష్ణురచింత్యాత్మా భక్తైర్భాగవతైస్సహ."

శ్లో. నివాస శయ్యాసనపాదుకాంశుకో
పధానవర్షాతపవారణాదిభిః,
శరీరభేదై స్తవ శేషతాం గతై
ర్యథోచితం శేషఇతీర్యతేజనైః. ౪౦

టీ. నివాసశయ్యాసనపాదుకాంశుకోపధానవర్షాతపవారణాదిభిః - నివాస = గృహము, శయ్యా = పడక, ఆసన= సింహాసనము, పాదుక = పాదుకలు, అంశుక = పీతాంబరము, ఉపధాన = దిండు, వర్షాతపవారణ = ఛత్రము, ఆదిభిః = మొదలైన, తవ = నీకు, శేషతాం = దాసత్వమును, గతైః = పొందిన, శరీరభేదైః = విగ్రహభేదములచేత, యథోచితం = తగునట్లుగా, శేష ఇతి = శేషుఁడని, జనైః = జనులచేత, ఈర్యతే = చెప్పఁబడుచున్నాఁడు.

తా. వేంచేసియుండునప్పుడు దివ్యాస్థానము,నిద్రావసరమందు శయ్యయు, విహారసంచారములందు పాదుకలు, పీతాంబరము యుపధానము దివ్యచ్ఛత్రము మఱియుం దమ యభినివేశానుగుణముగా సహస్రసంఖ్యాకములైన విగ్రహములు తత్తత్కాలోచితముగాఁ బరిగ్రహించి సర్వవిధకైంకర్యములఁ జేయుచు తదనుగుణముగా సమస్తజనులచే శేషుండని యోగరూఢముగా వ్యవహరింపఁబడునట్టి కైంకర్యసామ్రాజ్య సార్వభౌమత్వ రూపవైభవాతి

శయముగల శ్రీమదనంతునియందు పిరాట్టితోఁ గూడి నిరవధికానందపరిపూర్ణుండై యున్నాఁడని తాత్పర్యము.

అవ. ఇట్లు శ్రీశేషుని అనుభవించి యీశ్లోకమందు నీశ్వరునకు వాహనధ్వజాది సకలవృత్తులు గలవారై యత్యంతాభిమతులైన పెరియ తిరువడి ననుభవించుచున్నారు:—

శ్లో. దాసస్సఖా వాహనమాసనంధ్వజో
యస్తే వితానం వ్యజనం త్రయీమయః,
ఉపస్థితం తేన పురో గరుత్మతా
త్వదఙ్ఘ్రిసమ్మర్దకిణాఙ్కశోభినా. ౪౧

టీ. త్రయీమయః = వేదస్వరూపుఁడైన, యః = ఏ పెరియతిరువడి, తే = నీకు, దాసః - శేషభూతుఁడు, సఖా = చెలికాఁడు, వాహనం = వాహనము, ఆసనం = సింహాసనము, ధ్వజః = టెక్కెము, వితానం = మేల్కట్టు, వ్యజనం = తాళవృంతము, అభూత్ = ఆయెనో, త్వదఙ్ఘ్రి సమ్మర్దకిణాఙ్కశోభినా - త్వత్ = దేవరవారియొక్క, అఙ్ఘ్రి = పాదముల యొక్క, సమ్మర్ద = ఒరియుటచేతనైన, కిణ = కాయలనే, అఙ్క = చిహ్నములచేత, శోభినా = ప్రకాశింపుచున్న, తేన=పూర్వోక్తవైభవములుగల, గరుత్మతా=గరుత్మంతునిచేత, ఉపస్థితం=సేవింపఁబడువాఁడును.

తా. తమయొక్క సమస్తవ్యాపారముల నీశ్వరముఖోల్లాసకరముగాఁ జేయుచు ననన్యార్హశేష

భూతులైనవారును జగత్సృష్ట్యాదివ్యాపారములం దీశ్వరుఁడు తమతో నాలోచనచేయునట్లు యభిమతులైనవారును ఆశ్రితుల నాపత్కాలములందు నీశ్వరుని నతివేగముతో దెచ్చి చేర్చువారును వేంచేసియుండునపుడు సింహాసనమై యుండువారును ఆపన్నసంరక్షణార్థము వచ్చుచున్న నీశ్వరుని దూరమునుండే తెలిసికొనునటుల వ్యాజమైయున్న వారును తమమీఁద నీశ్వరుని వేంచేపుచేసికొని పోవునపుడు వితానముగాను నుభయచామరములుగాను చేయఁబడిన పక్షములుగలవారును వేదములే యవయవములుగా గలవారును ఈశ్వరునకు శ్రీకౌస్తుభము స్వామిత్వచిహ్నమైనరీతిగా దమకు స్వామిపాదము లొరియుటవలనఁ గలిగిన కాయలే దాస్యచిహ్నములుగాగల పెరియతిరువడి యొక్క పార్శ్వమందుఁ బ్రకాశింపుచున్నవాఁడని తాత్పర్యము.

అవ. ఈశ్వరునిచేఁ దమయందుఁ చఁబడిన నుభయ విభూతి విషయధురమునకు నిర్వాహకులై యీశ్వరున కత్యంతాభిమతులైన శ్రీ సేనానాయకుల దాస్యసామ్రాజ్యవైభవము ననుభవించుచున్నారు:—

శ్లో. త్వదీయభుక్తోజ్ఝితశేషభోజినా
త్వయానిసృష్టాత్మభరేణయద్యథా,

ప్రియేణ సేనాపతినా నివేదితం
తథానుజానన్తముదారవీక్షణైః. ౪౨

టీ. త్వదీయభుక్తోజ్ఝితశేషభోజినా - త్వదీయ=నీసంబంధియైనదై, భుక్త = భుజింపఁబడినదై, ఉజ్ఝిత = విడువఁబడిన, శేష = శేషమును, భోజినా = భుజించువారును, త్వయా = నీచేత, నిసృష్టాత్మభరేణ-నిసృష్ట = ఉంచబడిన, ఆత్మ = తనయొక్క, భరేణ = ఉభయవిభూతిభారముగలవారును, ప్రియేణ=మిత్రులైన, సేనాపతినా = విష్వక్సేనులచేత, యత్=ఏకార్యము, యథా = ఏప్రకారము, నివేదితం = తెలియచేయఁబడినదో, తత్ = ఆకార్యమును, తథా = ఆప్రకారముగానే, ఉదారవీక్షణైః = గంభీరములైన కటాక్షములచేత, అనుజానన్తం = ఆజ్ఞచేయుచున్నవాఁడును.

తా. ప్రాప్యశేషియగు దేవరవారి తళియప్రసాదమే ధారకపోషకభోగ్యములుగాగలవారై దేవరవారి నియమనముచే నుభయవిభూతి భారమునకు నిర్వాహకులై యత్యంతాభిమతులైన శ్రీసేనముదలియాళ్వారులచే విన్నవింపంబడు సకలభువనపాలనకార్యములకు భవదభీష్టప్రకారము కానిమ్మనుటకు సూచకములై గంభీరములైన కటాక్షవీక్షణములచే ననుజ్ఞజేయువాఁడని తాత్పర్యము.

అవ. శ్రీమదనంత గరుడవిష్వక్సేనాదుల వైభవముల

ననుభవించి దీనియందు నిత్యసూరుల దాస్యసమృద్ధి ననుభవించు చున్నారు:—

శ్లో. హతాఖిలక్లేశమలై స్స్వభావత
స్సదానుకూల్యైకరసై _స్తవోచితైః,
గృహీతత త్తత్పరిచారసాధనై
ర్నిషేవ్యమాణం సచివై ర్యథోచితమ్. ४३

టీ. స్వభావతః = నైసర్గికముగా, హతాఖిలక్లేశమలైః-హత=నశింపఁజేయఁబడిన, అఖిల=సమస్తమైన, క్లేశ = అవిద్యాదులు, మలైః = ప్రకృతిసంబంధముగలవారును, సదా=ఎల్లపుడును, ఆనుకూల్యైకరసైః = తమలోఁదా మన్యోన్యము మహాప్రేమగలవారును, తవ = సర్వశేషియగు నీకు, ఉచితైః=తగినవారును, గృహీతత త్తత్పరిచారసాధనైః - గృహీత=గ్రహింపఁబడిన, త త్తత్పరిచార=ఆయాకైంకర్యములయొక్క, సాధనైః= చామరాదిసాధనములుఁగల, సచివైః = పరిచారకులచేత, యథోచితం = స్వరూపానుగుణముగా, నిషేవ్యమాణం = సేవింపఁబడుచున్నవాఁడును.

తా. అవిద్యాస్మిత రాగద్వేషాభినివేశములను క్లేశములయొక్కయుఁ బ్రకృతియొక్కయు సంబంధ ప్రాగభావముగల వారగుటచేఁ బ్రధ్వంసాభావము గల ముక్తులకంటె వ్యావృత్తులై సర్వదా స్వసత్తాప్రయుక్తమైన శ్రియఃపతి చరణసరోజ కైంకర్యము

గలవారగుటచే జాయమానకాల కటాక్షముగలిగి క్రమముగా సదాచార్య సంబంధాదులఁబడసి కైంకర్యప్రవిష్టులైన ముక్తులకంటె వ్యావృత్తులై నిత్యాభివాంఛిత పరస్పరనీచభావముగలవారై స్వరూపరూపగుణములచే నీకు సదృశులై యత్యాదరముచేఁ గైంకర్యోచితజలార్ద్రతాళవృంతాద్యుపకరణములను హస్తములందు ధరించుచున్న నిత్యసూరులచే సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందు సేవింపఁబడుచున్నవాఁ డనుట.

అవ. ఇట్లు నిత్యసూరులవైభవమును గొనియాడి యీ శ్లోకమం దీశ్వరుఁడు పిరాట్టిని నానావిధలీలలచే నానందింపచేయుటను సాయించుచున్నారు:—

శ్లో. అపూర్వ నానారసభావనిర్భర
ప్రబుద్ధయాముగ్ధవిదగ్ధలీలయా,
క్షణాణువత్క్షిప్తపరాదికాలయా
ప్రహర్షయన్తమ్మహిషీంమహాభుజమ్. ౨౨

టీ. అపూర్వనానారసభావనిర్భరప్రబుద్ధయా-అపూర్వ= నవీనములైన, నానా = అనేకవిధములైన, రస=శృంగారాదిరసములను, భావ = నిర్వేదాదిభావములను, నిర్భర=పూర్ణముగా, ప్రబుద్ధయా = వృద్ధిపొందునదియును, క్షణాణువత్ =అత్యల్పకాలమువలె, క్షిప్తపరాదికాలయా - క్షిప్త=జరపఁబడిన, పరాదికాలయా = అసంఖ్యాతకాలముగల, ముగ్ధవిదగ్ధలీలయా -

ముగ్ధ = నూతనములై, విదగ్ధ = చాతుర్యముగల, లీలయా = విలాసములచేత, మహిషీం = పెరియపిరాట్టిని, ప్రహర్షయన్తం = ఆనందింపచేయువాఁడును, మహాభుజం=ఆజానుబాహువులు గలవాఁడును.

తా. అప్పటప్పటికి నపూర్వములుగాఁ దోఁచుచున్నవై నానావిధంబులగు శృంగారాదిరసములు నిర్వేదాది భావములునుగలవి గనుక బ్రహ్మకల్పాదులను క్షణంబువలె దోఁపించుచున్న చాతుర్యరసభరితవిలాసములచేత నాజానులంబములగు బాహువుల గాఢోపగూఢములచేతను శ్రీ పెరియపిరాట్టియారును నానందాబ్ధియందు ముంచుచున్న వాఁడని యభిప్రాయము.

అవ. ఇట్లు పిరాట్టిని యానందింపఁజేయుగుణముల కావాసమగు దివ్యమంగళవిగ్రహగుణముల ననుభవించుచున్నారు:-

శ్లో. అచిన్త్యదివ్యాద్భుతనిత్యయౌవన
స్వభావలావణ్యమయామృతోదధిమ్,
శ్రియశ్శ్రియం భక్తజనైకజీవితం
సమర్థమాపత్సఖమర్థికల్పకమ్. ౨౫

టీ. అచిన్త్యదివ్యాద్భుతనిత్యయౌవన స్వభావలావణ్యమయామృతోదధిమ్ - అచిన్త్య = చిన్తింపఁగూడనివై, దివ్య= అప్రాకృతమై, అద్భుత = ఆశ్చర్యకరమై, నిత్య = స్థిరమైన,

యౌవన=తారుణ్యము, స్వభావ=నిసర్గమైన, లావణ్యమయ = కాన్తిమయమైన, అమృతోదధిం = క్షీరసాగరమైనవాఁడును, శ్రియః = పిరాట్టికి, శ్రియం = సంపత్తైనవాఁడును, భక్తజనైక జీవితం - భక్తజన = ప్రపన్నజనులకు, జీవితం = ప్రాణములైన వాఁడును, సమర్థం=అఘటితఘటనాసామర్థ్యముగలవాఁడును, ఆపత్సఖం = ఆపద్బన్ధువైనవాఁడును, అర్థికల్పకం = యాచకుల పాలిటి కల్పవృక్షమైనవాఁ డవును.

తా. వాఙ్మనసాగోచరమై యప్రాకృతమై స్వేచ్ఛా పరిగృహీతమైన దివ్యమంగళ విగ్రహముయొక్క స్వభావసిద్ధమై యాశ్రితదృష్టిచిత్తాపహారియగు సముదాయశోభ చేఁ బ్రకాశించుచున్న వాఁడును నమృతసాగరమువలె భోగ్యభూతుండును నఖిల లోకమంగళకరురాలగు పిరాట్టికిని మంగళావహుం డును ఆశ్రితులకు బ్రాణప్రియుండును ఆశ్రితులే ప్రాణములుగాగలవాఁడును బద్ధసంసారులును నిత్య సూరులగోష్ఠియందుఁజేరి తన్ననుభవించునటులఁ జేయునట్టి యఘటితఘటనాసామర్థ్యముగలవాఁ డును బ్రళయాపత్తునందు నంచరెనిం గుక్షియందుంచి కాపాడువాఁడును దన్నుపాసించు భక్తులకు వారి వారియభీష్టప్రకారము బ్రహ్మాదిపదవులను మహా పురుషార్థమునున్ను గృపఁజేయువాఁడు నని తాత్ప ర్యము.

అవ. ఇట్లు స్వరూపరూపగుణవిభూత్యైశ్వర్యములచేఁ బరిపూర్ణుండైన దేవరవారిని నితరవిషయవిరక్తిపూర్వముగా సర్వవిధకైంకర్యములచే నెన్నఁ డానందింపఁజేయుటో యని మొఱవెట్టుచున్నారు:—

శ్లో. భవన్తమేవానుచరన్నిరన్తర
ప్రశాన్తనిశ్శేషమనోరథాన్తరః,
కదాహమైకాన్తికనిత్యకిఙ్కరః
ప్రహర్షయిష్యామి సనాథజీవితమ్. ౪౬

టీ. భవంతమేవ = దేవరవారినే, అనుచరన్ = అనుసరించుచు, నిరన్తరప్రశాన్తనిశ్శేష మనోరథాన్తరః - నిరన్తర = ఎల్లపుడు, ప్రశాన్త = శమించిన, నిశ్శేష = మిగతలేని, మనోరథాన్తరః = ఇతరవిషయాభిలాషగలవాఁడనై, కదా= ఎప్పుడు, అహం = నేను, ఐకాన్తిక నిత్యకింకరః = ఏకరూపయావదాత్మభావికైంకర్యమే నిరూపకముగాగలవాఁడనై, సనాథజీవితం = నిరుపాధికశేషిగల జీవనముగలవాఁడ నగునట్లుగా, ప్రహర్షయిష్యామి = ఆనందింపచేయఁగలనో.

తా. స్వరూపరూపగుణ విభూత్యైశ్వర్యంబులచేఁ బరిపూర్ణుండవైన దేవరవారినే సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందు సంశ్లేషించిన వాఁడనై యితరవిషయాభిలాషలనుసమూలముగావదలి దేవర వారి తిరువడియందు రుచివినాగాఁ గటాక్షింపందగిన

వేఱుపాయాంతరములేని నేను ఏకరూపమై యావదాత్మభావియగు కైంకర్యమే నిరూపకముగాఁగలవాఁడనై యనన్యార్హమైన నాత్మవస్తువుకు నిరుపాధికశేషియగు దేవరవారిని సర్వవిధకైంకర్యములచే నానందింపఁజేయడమను పరమప్రాప్యమును లభించుటెన్నఁడో.

అవ. ఇట్లు స్వరూపోచితమైన పురుషార్థమును బ్రార్థించి యీశ్లోకమం దీశ్వరుని వైలక్షణ్యమును దాము ప్రార్థించియుండు పురుషార్థము బ్రహ్మాదులయొక్క మనస్సులకున్ను స్మరింపఁగూడని విషయమై యస్పృష్టసంసార గంధులగు నిత్యసూరులు ప్రార్థించి లభింపవలసినదై యుండుట నాలోచించి నిత్యసంసారియగు దామీలాగున నభిలషించినందుకై తమను నిందించుకొనుచున్నారు:—

శ్లో. ధిగశుచిమవినీతం నిర్దయంమామలజ్జం
పరమపురుష యోఽహం యోగివర్యాగ్రగణ్యైః,
విధిశివసనకాద్యైర్ధ్యాతుమత్యన్తదూరం
తవపరిజనభావం కామయే కామవృత్తః. ౮౭

టీ. అశుచిం = అపరిశుద్ధుఁడనైనవాఁడును, అవినీతం= శిక్షితుఁడను కానివాఁడును, నిర్దయం = దయారహితుండును, అలజ్జం = సిగ్గులేనివాఁడనునైన, మాం = నన్ను, ధిక్ =నిందింపుము. యః=ఏ, అహం= నేను, యోగివర్యాగ్రగణ్యైః = పరమ

యోగులగు, విధిశివసనకాద్యైః = బ్రహ్మరుద్ర సనకసనందనా దులచేత, ధ్యాతుం = తలచుటకును, అత్యన్తదూరం = మిక్కిలి దూరమగు, తవ = నీకు, పరిజనభావం = పరిచారకుఁడగుటను, కామవృత్తిః = స్వేచ్ఛావర్తనముగలవాఁడనై, కామయే=అభిల షించుచున్నాను.

తా. అనాదిసంసారసంబంధముగలవాఁడనై తత్సంబంధనివర్తకమగు సదాచార్య సేవయులేనివాఁడనై నిత్యసూరులయొక్క యమృతమగు భగవత్తత్త్వము ననుభవించుట కెత్తించిన నిర్దయుండనై స్వనికర్షతనాలోచింపక విలక్షణ విషయము నభిలషించుచున్న నిర్లజ్జుండ నగు నేను విషప్రవణుఁడు యుక్తాయుక్తముల నాలోచింపక ప్రవర్తించునట్లు పరమయోగులగు బ్రహ్మరుద్రాదులయొక్క మనస్సులకున్ను స్మరింపఁగూడనిదై యస్పృష్టసంసారగంధులగు నిత్యసూరులకే యనన్యార్హభోగ్యమగు కైంకర్యరూప పరమపురుషార్థమును ప్రార్థించి పరోత్కర్ష స్వనికర్షతల నాలోచింపక స్వేచ్ఛాప్రవర్తనుండనై కేవల నింద్యుండ నగుచున్నా నని తాత్పర్యము.

అవ. పరమవిలక్షణమగు పురుషార్థమును బద్ధసంసారి యగు దామాశబడుట నుచితముగాదని తమ్మునిందించికొని మఱల నీశ్లోకమందు కైంకర్యమందలి భోగ్యతాతిశయంబువలన దేవర

హారి నిర్హేతుకకృపచేఁ బురుషార్థసిద్ధివిళంబహేతువులగు సమస్త పాపములను నివర్తింపఁజేసి యంగీకరింపవలయునని ప్రార్థింపు చున్నారు:—

శ్లో. అపరాధ సహస్ర భాజనం
పతితం భీమభవార్ణవోదరే,
అగతిం శరణాగతం హరే
కృపయా కేవలమాత్మసాత్కురు. ౭౭

టీ. అపరాధసహస్రభాజనం - అపరాధసహస్ర=అసంఖ్యేయములగు నపరాధములకు, భాజనం=పాత్రమైనవాఁడును, భీమభవార్ణవోదరే - భీమ = భయంకరమగు, భవార్ణవ=సంసారసాగరముయొక్క, ఉదరే = మధ్యమందు, పతితం = పడియున్నవాఁడును, అగతిం = రక్షకాంతరము లేనివాఁడనున్న, శరణాగతం = శరణాగతుండనైన నన్ను, హేహరే = సర్వదోషనివర్తకుఁడైన యోస్వామీ! కృపయా కేవలం= నిర్హేతుకకృపచేతనే, ఆత్మసాత్ = అనన్యార్హశేషభూతునిగా, కురు = చేయుము.

తా. దేవరవారు సమస్తకల్యాణగుణపరిపూర్ణులై నట్లు సకలాపరాధములకు స్థానభూతుండనై యా యపరాధంబులను క్షణక్షణమందు వృద్ధిబొందించు సంసారమను మహాసాగరమందు నుద్ధరించుట కెత్తించిన దేవరవారికిన్నందఁగూడనిమధ్యమందు మునింగినవాఁడనై గత్యంతరశూన్యుండనై దేవరవారినే

యుపాయోపేయములుగా నధ్యవసించిన నన్ను నిర్హేతుకమైన కృపచేతనే యనన్యార్హ శేషభూతునిగా నంగీకరింపవలయు నని తాత్పర్యము.

అవ. ఇట్లు ప్రార్థింపఁగా నపరాధబాహుళ్యముగల మీరు తత్ప్రాయశ్చిత్తములై శాస్త్రవిహితములైన యుపాయములచే నాయపరాధములను నివర్తింపఁజేసికొనక కేవలకృపచే నంగీకరింపవలయునని నిర్బంధించుటేమని యీశ్వరున కభిప్రాయముగాఁగా శాస్త్రీయానుష్ఠానమునకు తత్త్వజ్ఞానమే లేదు గనుక గత్యంతరము లేనివాఁడనైనందున దేవరవారి విశేషకటాక్షమే దాసునికి జీవసాధనమని సాయించుచున్నారు:—

శ్లో. అవివేకఘనాంధదిఙ్ముఖే
బహుధాసంతతదుఃఖవర్షిణి,
భగవన్ భవదుర్దినేపథః
స్ఖలితం మామవలోకయాచ్యుత. ४౯

టీ. హేభగవన్ = సకలకల్యాణగుణపరిపూర్ణుఁడై, అచ్యుత = ఆశ్రితులను చేవదలని యో స్వామీ! అవివేకఘనాంధదిఙ్ముఖే - అవివేక = అజ్ఞానమనే, ఘన= మేఘములచేత, అంధ = కటికచీఁకటిగల, దిక్ = దిక్కులయొక్క, ముఖే = ప్రాగ్భాగములుగలదియు, బహుధాసంతతదుఃఖవర్షిణి - బహుధా = నానారూపములైనవై, సంతత = అవిచ్ఛిన్నములైన, దుఃఖ = క్లేశములను, వర్షిణి = వర్షములుగలదియునైన, భవదుర్దినే-భవ=సంసారమను, దుర్దినే=గాఢాంధకారదినమునందు,

పథః=మార్గమునుండి, స్ఖలితం = తప్పిపోయిన, మాం = నన్ను, అవలోకయ = కటాక్షింపుము.

తా. అజ్ఞానాన్యథాజ్ఞానవిపరీతజ్ఞానములను మహామేఘములచే నావరింపంబడియున్నందున దిఙ్మాత్రజ్ఞానమునకున్ను యోగ్యముగానిదై నానావిధములై యవిచ్ఛిన్నములగు దుఃఖపరంపరలను వర్షధారలచే నతిమాత్రము బాధకంబగు సంసారమను గాఢాంధకారదినమునందు దారితప్పి యామార్గములందు సంచరించుట కనర్థపడిపోవుచున్న నన్ను నాయొక్క యనర్థములను పరిహరించుటకును నభీష్టములను గృపచేయుటకును దగిన జ్ఞానశక్త్యాది సకలకల్యాణగుణపరిపూర్ణులగు దేవరవారు నిర్హేతుకకృపాకటాక్షముచే నంగీకరింపవలయును.

అవ. దాసునికి దేవరవారి కృపాకటాక్షమువినాగా రక్షకాంతరము లేనట్టువలె దేవరవారికృపకును దాసుఁడు వినాగా వేఱువిషయములేనందున నవశ్యము కటాక్షింపవలయునని వేడుచున్నారు:—

శ్లో. న మృషా పరమార్థమేవ మే
శృణు విజ్ఞాపన మేకమగ్రతః,
యది మే నదయిష్యసే తతో
దయనీయ స్తవనాథ దుర్లభః. ౫౦.

టీ. మృషా=అబద్ధము, న=కాదు. పరమార్థమేవ=యథార్థమేయగు, ఏకం=ముఖ్యమగు, మే=నాయొక్క, విజ్ఞాపనం=విన్నపమును, అగ్రతః = ఎదుట, శృణు=వినుము. మే=నాకు, నదయిష్యసేయది = దయఁజేయనివాఁడవైతివేని, తతః=పిమ్మట, హేనాథ = ఓస్వామీ! తవ = దేవరవారికి, దయనీయః = దయఁజేయఁదగినవాఁడు, దుర్లభః=లభింపఁగూడనివాఁ డగును.

తా. కరణత్రయమేకరూపమై దేవరవారికెదుట సత్యముగా విన్నవించునదేమనిన; ననాదికాలముగా దేహాత్మవిభాగజ్ఞానములేనివాఁడనై ప్రాకృతవిషయముల లాభాలాభములనే పురుషార్థవినాశములనుగా దలఁచి పరహింసాదులే యాత్రగానున్నను దేవరవారియాకస్మికకటాక్షవిశేషముచే స్వస్వరూపజ్ఞానమాత్రముగలవాఁడనై భగవన్నిర్హేతుకకృపయే యిష్టానిష్టప్రాప్తిపరిహారసాధకమని నిశ్చయించి ప్రార్థింపుచున్న దాసుని ననుగ్రహింపవేని సర్వాపరాధభూయిష్ఠమగు నావంటివిషయము వేఱులేనందున నాపన్నార్తిప్రశమనమే ముఖ్యజీవనముగాగల దేవరవారి కృప గత్యంతరములేనిదగును గనుక నవశ్య మనుగ్రహింపవలయును.

అవ. స్వస్వరూపపరస్వరూపమాత్రజ్ఞానముగలవాఁడనై భగవన్నిర్హేతుకకృపైకనిర్వాహ్యుండగు దాసుని ననుగ్రహించు

టవలన స్వస్వాములకు నుభయులకును లాభముగలదు గనుక చేయివదలవలదని సాయించుచున్నారు:—

శ్లో. తదహం త్వదృతే న నాథవాన్
మదృతే త్వం దయనీయవాన్న చ,
విధినిర్మిత మేతదన్వయం
భగవన్పాలయ మాస్మజీహపః. ౫౧

టీ. తత్=పరమార్థ మట్లుండుటవలన, అహం=నేను, త్వదృతే=నిన్నువినాగా, నాథవాన్=స్వామినిగలవాఁడను, న=కాను. త్వం=నీవు, మదృతే=నన్నువినాగా, దయనీయవాన్=దయనీయవిషయముగలవాఁడవు, న=కావు. భగవన్=సకలకల్యాణగుణపరిపూర్ణుఁడగు ఓస్వామీ! విధినిర్మితం=దేవరవారి నిర్హేతుకకృపచే నేర్పరుపఁబడిన, ఏతదన్వయం=దయావత్వ దయనీయత్వరూపమగు నీసంబంధమును, పాలయ=కాపాడుము. మాస్మజీహపః=చేయివదలకుము.

తా. అనాదికాలముగా నాత్మాపహారాద్యనంతక్రూరాపరాధంబుల బుద్ధిపూర్వకంబుగా నొనర్చి తత్ఫలకాలమం దనుతాపమునొందుచున్న నేను సర్వలోకశరణ్యుఁడై ప్రాప్తశేషియగు దేవరవారిని లభించితిని దేవరవారును పరదుఃఖాసహామగు నిర్హేతుకకృపకుఁ బరిపూర్ణవిషయమగు దాసుని లభించితిరి శేషిశేషభూతుల కిరువురకును పరస్పరలాభకారియై

నిరవధికానందావహమగు నీసంబంధమును గాపాడి కొనుచు మఱి యెన్నండును జేయివదలకుండ వలయునని భావము.

అవ. ఇట్లు ప్రార్థింపఁగా నీశ్వరుండు నేను జీవస్వరూపానురూపముగా రక్షించువాఁడను గనుక మిమ్మును నిర్ణయించియుండు ప్రకారమును దెలియఁజేసితిరేని మీ నిర్ణయప్రకారము రక్షించుచున్నాననఁగా నే నెట్టివాఁడనైనను దానిలో నిర్బంధమేమియు నాకులేదు. అహంశబ్దవాచ్యమును దేవరవారి శ్రీపాదములందు సమర్పించితినని విన్నవించుచున్నారు:—

శ్లో. వపురాదిషు యోపికోపివా
గుణతోసాని యథాతథావిధః,
తదయం తవ పాదపద్మయో
రహమద్యైవ మయా సమర్పితః. ౫౨

టీ. వపురాదిషు = శరీరాదులయందు, యోపికోపివా = ఎవఁడైనను, అసాని=అగుదునుగాక. గుణతః=స్వభావమువలన, యథాతథావిధః=ఎట్టిరీతిగలవాఁడైనను, అసాని=అగుదునుగాక. తత్=ప్రస్తుతసమర్పణమున కెట్టిదిగానున్నను విరోధములేమి వలన, అయమహం = పరాగర్థవ్యావృత్తుఁడైన నేను, మయా = నాచేత, తవ=దేవరవారియొక్క, పాదపద్మయోః=తామరపుష్పములవంటి తిరువడిగళందు, అద్యైవ=ఇప్పుడే, సమర్పితః=సమర్పింపఁబడెను.

తా. ఆత్మజ్ఞానస్వరూపమై నిత్యమై ప్రతిశరీర భిన్నమై దేహేంద్రియమనఃప్రాణబుద్ధ్యాదులకంటె వేఱైనదైనను లేక వీటిలో నొకటైనను నాకేమియు నిర్బంధము లేదు విభుత్వాణుత్వశరీరపరిమాణత్వజడత్వాజడత్వ జ్ఞాతృత్వకర్తృత్వభోక్తృత్వశేషత్వాదులలో నెట్టిస్వభావముగలదైనను నావిచారణ యేమియు నాకుం బనిలేదు. ప్రాప్తశేషియగు దేవరవారియొక్క నిరతిశయభోగ్యములైన శ్రీపాదములందు అహంశబ్దవాచ్యార్థమును సద్యోదశాహముగా సమర్పించితిని.

అవ. ఈప్రకార మాత్మసమర్పణమొనర్చిన నెవరిసొత్తును నెవరికి సమర్పించితిరి యోచింపుండని యీశ్వరుఁ డడుగగా వానిసొత్తును తమదిగాభావించి సమర్పించియుండుట నాలోచించి యీసమర్పణ మాత్మాపహారముతో తుల్యమైయున్నందున నందుకై పరితపించుచున్నారు:—

శ్లో. మమ నాథ యదస్తి యోస్మ్యహం
సకలం తద్ధితవైవ మాధవ,
నియతస్వమితి ప్రబుద్ధధీః
అథవా కిన్నుసమర్పయామి తే. 53

టీ. హే మాధవ=శ్రియఃపతియై, నాథ=సకల చేతనా చేతనములకు నాయకుండగు ఓస్వామీ! మమ=నాకు, యత్ =

యేది, అస్తి=ఉన్నదో, అహం=నేను, యః = ఎవఁడు, అస్మి= అగుచున్నానో, తత్సకలం = అదియంతయు, తవైవహి = నీ యొక్క సొత్తేగదా, నియతస్వమితి=సర్వము సకలము దేవర వారికే యనన్యార్హమగు సొత్తైనదని, ప్రబుద్ధధీః-ప్రబుద్ధ = తెలిసికొనిన, ధీః=జ్ఞానముగల నేను, అథవా = ఆలాగైన, తే = సర్వస్వామియగు దేవరవారికి, కిన్ను సమర్పయామి=ఏమి సమ ర్పింపంబోవుచున్నాను.

తా. అనాద్యచిత్సంబంధనిబంధమగు మమకార మునకు విషయములగు ప్రకృతిప్రాకృతములును అట్టి మమకారమున కాశ్రయమగు నేనును సకల మును శ్రియఃపతియగు దేవరవారికే యనన్యార్హ మగు సొత్తైయుండుటనున్ను సకలచేతనాచేతనము లకు నిరుపాధికశేషియగు దేవరవారిది కానిదియు నాదిగానుండునదియును నేదియు లేదని నిర్హేతుక విశేషకటాక్ష లబ్ధాత్మయాథాత్మ్యజ్ఞానముచేఁ దెలిసి కొనిన నేనేమిటిని సమర్పింపఁబోవుచున్నాను.

అవ. దేవరవారి కటాక్షవిశేషముచే లభించిన నాత్మ యాథాత్మ్యజ్ఞానము పురుషార్థోపయోగియగునట్లు నిర్హేతుకకృ పచే పరభక్తినిన్ని గృపచేయవలయునని ప్రార్థించుచున్నారు:-

శ్లో. అవబోధితవానిమాం యథా

మయినిత్యాంభవదీయతాం స్వయమ్,

కృపయైవ మనన్యభోగ్యతాం
భగవన్ భక్తిమపి ప్రయచ్ఛ మే. ౫౮

టీ. మయి = నాయందు, నిత్యాం = కాలత్రయావస్థాయి యగు, ఇమాం=ఈ, భవదీయతాం=నీకే యనన్యార్హశేషమై యుండుటను, స్వయం=నీవే, యథా=ఏప్రకారము, అవబోధి తవాన్ = తెలియఁజేసితివో, ఏవం=ఈప్రకారము, భగవన్= సకలకల్యాణ గుణపరిపూర్ణుఁడవగు ఓస్వామీ! అనన్యభోగ్య తాం = భవద్వ్యతిరిక్తవిషయముల నిస్సారముగాఁ దలఁచు నట్టి, భక్తిమపి = భక్తినిన్ని, మే=నాకు, ప్రయచ్ఛ = కృపఁ జేయుము.

తా. అనాదికాలముగా నేను నాది యనుఅహం కార మమకారములచే ననర్థపడిపోవుచున్న నాకు జాయమానకాలకటాక్షవిశేషముచే స్వస్వరూపపర స్వరూపయాథాత్మ్యజ్ఞానమును గృపఁజేసి త్వదన న్యార్హశేషత్వమందలి భోగ్యతాతిశయమును దెలి యఁజేసిన దేవరవారే భవద్వ్యతిరిక్తవిషయ వైరాగ్యపూర్వకమైన భక్త్యతిశయమునున్ను కృపఁ జేయవలయును.

అవ. తా మపేక్షించినప్రకార మీశ్వరానుగ్రహముచే లబ్ధమైన భక్తిరసమును తదీయపర్యంతము ప్రవహింపఁజేయ వలయు నని వేడుకొనుచున్నారు:—

శ్లో. తవదాస్య సుఖైకసంగినాం
భవనేష్వ స్త్వపికీటజన్మ మే,
ఇతరావసథేషుమాస్మభూ
దపిమే జన్మ చతుర్ముఖాత్మనా. ౫౫

టీ. తవ=దేవరవారియొక్క, దాస్యసుఖైక సంగినాం-దాస్య = కైంకర్యసామ్రాజ్యమందలి, సుఖ = ఆనందాతిశయమందు, ఏకసంగినాం = అత్యంతాసక్తులైన భాగవతాగ్రగణ్యులయొక్క, భవనేషు = గృహములందు, మే=నాకు, కీటజన్మాపి = అచిత్ప్రాయ జంతుజన్మమైనను, అస్తు=అవుగాక, ఇతరావసథేషు = బ్రహ్మాదిలోకములందు, చతుర్ముఖాత్మనాపి=హిరణ్యగర్భ స్వరూపముతోనైనను, జన్మ=పుట్టువు, మే=నాకు, మాభూత్=లేకపోవుగాక.

తా. శ్రియఃపతియై సకలకల్యాణగుణపరిపూర్ణుండవై ప్రాప్తశేషియగు దేవరవారియొక్క ముఖోల్లాసమే పరమపురుషార్థముగాఁగలవారై నిష్యందమానమకరందధారాసందోహ కందళదరవిందసుందరములగు భవచ్చరణసరోజములందు నిరంతరసర్వవిధకైంకర్యములే ధారకపోషక భోగ్యములుగాఁగలవారై నిరంతరనీరంధ్ర నిరవధికానందాంబుధిమగ్నులైయున్న భాగవతాగ్రగణ్యులయొక్క గృహములందు తత్కృష్టాపకర్షవిభాగములేక యెట్టి

జన్మముతోనైన నను ఆపరమభాగవతోత్తములను అనవరత మెడబాయకుండవలయును. అవైష్ణవస్థలములందు అండాధిపత్య ధురంధరచాతుర్య చతుర్ముఖ బ్రహ్మాగానైనను జన్మము కలుగకుండునట్లు గృపచేయవలయును.

అవ. ఈప్రకారము భాగవతసంసర్గనివృత్తిని అపేక్షించి మహనీయులగు శ్రీవైష్ణవులు కటాక్షించి నప్పుడు దాసుని దమవానివిగా నభిమానించునటుల గృపచేయవలయునని ప్రార్థింపుచున్నాడు:—

శ్లో. సకృత్త్వదాకార విలోకనాశయా
తృణీకృతానుత్తమభుక్తిముక్తిభిః,
మహాత్మభిర్మామవలోక్యతాం నయ
క్షణేపి తే యద్విరహోతిదుస్సహః. ౫౬

టీ. సకృత్ = ఒకానొకప్పుడు, త్వదాకారవిలోకనాశయా-త్వత్ = దేవరవారియొక్క, ఆకార = దివ్యమంగళవిగ్రహమును, విలోకన = సేవించుటయందు, ఆశయా=అపేక్షచేత, తృణీకృతా నుత్తమభుక్తిముక్తిభిః - తృణీకృత = తృణముగా దలచఁబడిన, అనుత్తమభుక్తి = బ్రహ్మేంద్రాదిభోగములు, ముక్తిభిః = మోక్షముగల, మహాత్మభిః = భాగవతాగ్రగణ్యులచేత, మాం=నన్ను, అవలోక్యతాం = కటాక్షింపఁబడిన వాఁడగుటను, నయ=పొందింపుము. తే=దేవరవారికి, యద్వి

రహాః = యే వైష్ణవుల విశ్లేషము, క్షణేపి = క్షణకాలమైనను, అతిదుస్సహాః = మిక్కిలి సహింపఁగూడనిదో.

తా. [1]దయాక్షాంత్యౌదార్యవాత్సల్యసౌశీల్య సౌలభ్యాద్యనంతకల్యాణగుణాశ్రయంబై [2]సౌంద ర్య సౌకుమార్య లావణ్యాద్యనవధికాసంఖ్యేయా ఖిల శుభగుణవిరాజమానంబై [3]యఖిలజగన్మాత యగు పిరాట్టికి నివాసస్థానంబై [4]సకలచేతనదృష్టి చిత్తాపహారకంబగు దివ్యమంగళవిగ్రహంబు [5]నొక తూరి సేవింపవలయునను నపేక్షచేత నందాధిప

---

1. "బహవో నృపకల్యాణ గుణాః పుత్రస్య సంతితే, సంఖ్యాతుం నైవశక్యంతే" ఇత్యాది.

2. "పీతాంబరధరః స్రగ్వీ సాక్షాన్మన్మథమన్మథః."

3. "రూపౌదార్యగుణైః పుంసాం దృష్టిచిత్తాపహారిణం."

4. "అలమద్య హి భుక్తేన పరమార్థైరలంచనః, యథా పశ్యామ నిర్యాంతం రామంరాజ్యే ప్రతిష్ఠితం. ఇచ్ఛామోహి మహాబాహుం రఘువీరం మహాబలం, గజేన మహతా యాంతం రామం ఛత్రావృతాననమ్. మేఘశ్యామం మహాబాహుం స్థిర సత్వం దృఢవ్రతం, కదా ద్రక్ష్యామహేరామం జగతశ్శో కనాశనం. భక్తిశ్చ నియతావీర భావోనాన్యత్ర గచ్ఛతీత్యాది, యస్త్వయాసహసస్వర్గో నిరయోయస్త్వయావినా."

5. "నజీవే యం క్షణమపి వినాతామసితేక్షణాం, కదా

త్యంబు ఆత్మానుభవ రూపకైంకర్యంబు పరమపురు షార్థభగవత్ప్రాప్తి రూపమోక్షంబు వీని నన్నిం టినిం ద్రృణీకరించియుండు వారును [6]దేవరవారికిని క్షణకాలవిశ్లేషమతి దుస్సహమగునట్టి యత్యంతాభి మతులైనవారును [7]తమదర్శన స్పర్శనాదులచేతనే సకలమును సంసారబంధమునుండి విడుదలఁజేయించు నట్టి ప్రభావసంపన్నులై సకలదేవతాసమ్మాన్యమ హత్త్వముగల మహనీయులగు భాగవతాగ్రగ ణ్యులు కృపారసపూరితములై [9]తాపత్రయాది సకల సంతాపోపశామకములగు దమకటావీక్షణములచేత దాసుని తమవానినిగా నభిమానించి యేలుకొను నటుల గృపచేయవలయును.

అవ. ఈప్రకారము శేషత్వసీమాభూమియగు తదీయ శేషత్వంబు అపేక్షించి యిట్టిశేషత్వమునకు బహిర్భూతమగు నాత్మాత్మీయములను నివర్తింపచేయవలయునని వేడుచున్నారు:-

---

న్వహం సమేష్యామి భరతేన మహాత్మనా. మమప్రాణా హి పాండవాః, జ్ఞానీత్వాత్మైవ మేమత" మిత్యాది.

6. "యం యం స్పృశతి పాణిభ్యాం యం యం పశ్యతి చక్షుషా, స్థావరాణ్యపి ముచ్యన్తే కింపునర్బాంధవాజనాః."

7. "ద్రవన్తిదైత్యాః ప్రణమన్తి దేవతా" న్నిత్యాది.

8. "సద్యస్సంతీయతే తాపో దర్శనా దేవతాదృశాం."

శ్లో. నదేహం నప్రాణాన్నచసుఖమశేషాభిలషితం
నచాత్మానంనాన్యత్కిమపితవశేషత్వవిభవాత్,
బహిర్భూతంనాథక్షణమపిసహేయాతుశతధా
వినాశం తత్సత్యం మధుమథనవిజ్ఞాపనమిదమ్.

టీ. హేనాథ = ఓస్వామి ! తవ = దేవరవారియొక్క, శేషత్వవిభవాత్ - శేషత్వ = సామ్రాజ్యమునకంటె, బహిర్భూతం = వెలుపలిదైన, దేహం = శరీరమును, నసహే = సహింపను. ప్రాణాన్ = ప్రాణములను, నసహే = సహింపను. అశేషాభిలషితం = సకలమైనవారిచే నపేక్షింపఁబడు, సుఖం = సౌఖ్యమునున్ను, నసహే = సహింపను. ఆత్మానం = ఆత్మనున్ను, నసహే = సహింపను, అన్యత్ = పుత్రమిత్రకళత్రాదికమగు, కిమపి=దేనిన్ని, నసహే = సహింపను. తత్ = ఆయాత్మాత్మీయసముదాయమంతయు, శతధా = అనేకవిధములుగా, వినాశం = నాశమును, యాతు = పొందుగాక. హేమధుమథన = విరోధినివర్తకుండైన యోస్వామీ ! ఇదం విజ్ఞాపనం = ఈవిన్నపము, సత్యం = యథార్థము.

తా. సకలధర్మ సాధనమగు శరీరంబు అట్టిశరీరము ధరించియుండుటకు హేతువులగు ప్రాణంబులు ఆప్రాణములతో నుండి యనుభవింపఁదగినదైన బ్రహ్మాదిపిపీలికాంత సకలచేతన సముదాయముచే నపేక్షింపంబడు సుఖంబు దానికి భోక్తయై జ్ఞానా

నందస్వరూప పరమ విలక్షణ వస్తువగు జీవుండు వానికి నానందావహమగు పుత్రమిత్ర కళత్రాది వర్గంబు ఇవియన్నియు దేవరవారి విషయమందలి శేషత్వ సామ్రాజ్యమునకు నుపయుక్తము గాని యెడల క్షణకాలమైనను వీనినిసహింపను. ఈయాత్మాత్మీయములన్నియు నానాప్రకారములుగా నశించిపోగాక. ఇదిసత్యమైన విజ్ఞాపనము. ఇది సహృదయముగానియెడల దేవరవారి నిగ్రహమునకు పాత్రమైన మధువనురాక్షసుడు పొందిన దుర్గతిని పొందెద.

అవ. జ్ఞానతిరోధాయకమగు సంసారమందు వర్తింపుచు పరమయోగులకున్ను లభింపఁగూడని కైంకర్యవిరోధి నివృత్తి నపేక్షించుట యుచితమే యని భగవదభిప్రాయముగాఁగొని అన్నింటిని నివర్తింపచేయుటకు శక్తులగు దేవరవారి కల్యాణ గుణములను దలఁచి యపేక్షించితి ననుచున్నారు:—

శ్లో. దురంతస్యానాదేరపరిహరణీయస్యమహతో
నిహీనాచారోహంనృపశురశుభస్యాస్పదమపి,
దయాసింధో బంధో నిరవధికవాత్సల్యజలధే
తవస్మారం స్మారం గుణగణమితీచ్ఛామిగతభీః.

టీ. దురంతస్య = అవధిలేనిదియు, అనాదేః = ఆదిలేనిదియు, అపరిహరణీయస్య=పరిహరింపఁగూడనిదియు, మహతః= అపరిమితమైన, అశుభస్య = సకలపాపములకు, నిహీనాచారః=

నికృష్టాచారములుగలవాఁడును, నృపశుః = తెలివిహీనుఁడైన, అహం= నేను, ఆస్పదమపి = స్థానభూతుఁడైనను, దయాసింధో= దయాసముద్రుఁడును, బంధో = నిరుపాధికసంబంధము గలవాఁడును, నిరవధికవాత్సల్యజలధే = అతిమాత్రవాత్సల్యముగల యోస్వామీ! తవ= దేవరవారియొక్క, గుణగణం = కల్యాణ గుణసమూహమును, స్మారంస్మారం = తలఁచి తలఁచి, గతభీః = నిర్భయుఁడనై, ఇతి = పూర్వోక్తప్రకారముగా, ఇచ్ఛామి = అపేక్షింపుచున్నాను.

తా. అత్యంతము హేయమగు నడవడికగలవాఁడనై తల్లికిని నితరమునకును భేదములేక ప్రవర్తించు నరపశువుతోఁ దుల్యుండగు నేను అసంఖ్యాత బ్రహ్మకల్పంబు లనుభవించినను దుదముట్టనిదై యాదిలేనిదై సర్వశక్తిసంపన్నులగు దేవరవారికిని బరిహరింపఁగూడనిదై యవాఙ్మానసగోచరమగు పాపసమూహమునకు స్థానభూతుండై యున్నను గృపారసపరిపూర్ణులై నిరుపాధిక స్వస్వామి సంబంధముగలవారై సకలదోషభోగ్యులగు దేవరవారియొక్క కల్యాణగుణంబులఁ దలఁచితలఁచి భయము నివర్తించినవాఁడనై పురుషార్థవిరోధినివృత్తిని గృపచేయవలయునని వేడుచున్నాను.

అవ. గుణత్రయవశ్యుండగు దాసునియొక్క యిచ్ఛాసూచకవాక్యంబు నవలంబించి శేషత్వరూపమహాపురుషార్థమైల

క్షణ్యానుగుణముగా నాప్రేమను వృద్ధిచేసి యితరవిషయములందు చలింపకుండునట్లు మనస్సును శిక్షింపవలయునని వేడు చున్నారు:—

శ్లో. అనిచ్ఛన్నప్యేవం యదిపునరితీచ్ఛన్నివరజ
స్తమశ్ఛన్నచ్ఛద్మస్తుతివచనభంగీమరచయమ్,
తథాపీత్థంరూపం వచనమవలమ్బ్యాపికృపయా
త్వమేవైవం భూతం ధరణిధర మేశిక్షయమనః.

టీ. ఏవంయది=ఈప్రకారము వుండగా, అనిచ్ఛన్నపి=ఇచ్ఛయింపనివాఁడైనను, పునః=మరల, రజస్తమశ్ఛన్నః = రజస్తమోగుణములచే నావరింపఁబడినవాఁడనై, ఇచ్ఛన్నివ=ఇచ్ఛయింపుచున్నవానివలె, ఇతి = ఈప్రకారము, చ్ఛద్మస్తుతివచన భంగీం = కపటమైన స్తోత్రవాక్యప్రకారమును, అరచయం = చేసితిని. తథాపి = అట్లైనను, ఇత్థంరూపం = ఇట్లు కపటరూపమైన, వచనం = వాక్యమును, అవలంబ్యాపి = ఆధారముచేసికొనియైనను, కృపయా=దయచేత, హేధరణీధర = సర్వసహుండగు యోస్వామీ! త్వమేవ=నీవే, ఏవం భూతం=ఇట్లు కపట స్తోత్రమునకు కారణమైన, మే=నాయొక్క, మనః=మనస్సును, శిక్షయ=శిక్షింపుము.

తా. ప్రవృత్తి నివృత్తి ధర్మాధర్మ భయాభయ బంధమోక్షములను దెలియనివాఁడనై యుక్తాయుక్తవివేకశూన్యత అధర్మమందు ధర్మబుద్ధి సకలార్థములను విపరీతముగా నాలోచించుట మొద

లగు రజోగుణ తమోగుణములచేఁ బరిపూర్ణుఁడగు దాసునియొక్క శేషత్వబహిర్భూతాత్మాత్మీయ నివృత్తి రూప ప్రార్థనావాక్యము సహృదయము గాక కపటవచనముగానున్నను కంఠోక్తిమాత్రము నవలంబనము చేసికొని నిర్హేతుకకృపచే మనోవాక్కాయకములేకాకారణము గాక కృత్రిమముగా వర్తించు నాదుమనస్సును జక్కగా శిక్షించి కైంకర్యరూప పురుషార్థమందు ప్రేమాధిక్యము కలిగి యుండునట్లు తద్వ్యతిరిక్తవిషయములందుఁ జలింపకుండునట్లును గృపచేయవలయును.

అవ. ప్రేమలేకుండునపుడు కపటోక్తిని నవలంబించి యథార్థమైన ప్రేమాధిక్యమును గృపఁజేసి రక్షించుటకు నుపయుక్తముగా నీశ్వరునకు దమకునుండు నవర్జనీయబంధవిశేషములను సాయించుచున్నారు:—

శ్లో. పితా త్వం మాతా త్వం దయితతనయ
స్త్వం ప్రియసుహృ
త్త్వమేవ త్వం మిత్రం గురురపిగతి
శ్చాసి జగతామ్,
త్వదీయ స్త్వద్భృత్య స్తవపరిజన
స్త్వద్గతిరహం
ప్రపన్నశ్చైవం సత్యహమపి తవై
వాస్మిహి భరః. ౬౦

టీ. జగతాం = ఉభయవిభూతులకు, త్వం=నీవు, పితా= తండ్రివి, త్వం=నీవు. మాతా = తల్లివి, త్వం=నీవు. దయిత తనయః = ప్రియపుత్రుఁడవు, త్వం=నీవు. ప్రియసుహృత్ = ఇష్టుఁడవై శుభములను జేయువాఁడవు, త్వమేవ=నీవే. మిత్రం= పరమాప్తుఁడవు, త్వమేవ=నీవే. గురుః = జ్ఞానప్రదానము జేయు వాఁడవు, త్వమేవ=నీవే. గతిరపి = రక్షకుఁడును, అసి = అగు చున్నావు. అహం=నేను, త్వదీయః = నీకిష్టుఁడును, త్వద్భృత్యః=నీకనన్యార్హశేషభూతుఁడను, త్వద్భృత్యః = నీకు భరింపఁ దగినవాఁడను, తవ=నీకు, పరిజనః-పరిచారకుడను, త్వద్గతిః - నీవేరక్షకముగాగలవాడను, ప్రపన్నశ్చ = నీవే ప్రాప్యప్రాపక ములుగా గలవాఁడనగుచున్నాను, ఏవంసతి = ఈప్రకారము గాగా, అహమపి = నేనును, తవైవ = నీకే, భరః = భారము; అస్మి హి = అగుచున్నానుగదా.

తా. [1]ఉభయవిభూతులందలి సకలచేతనులకు నుత్పాదకుఁడై హితైకతత్పరుఁడగు తండ్రియైన వాఁడును గర్భధారణప్రసవాదిక్లేశములకోర్చి సకల విధములచేఁ బోషింపుచు ప్రియమే జరుపుతల్లియైన వాఁడును అత్యంతాభిమతుఁడై నిరయనిస్తారకుఁడగు పుత్రుఁడైనవాఁడును అనవరతము సర్వవిధోపకార ములఁజేయు సుహృత్తైనవాఁడును దమతమయభీష్ట

1 "మాతా పితా భ్రాతా నివాసశ్శరణం సుహృద్గతి ర్నారాయణః."

ములను దెలియఁజేసి నెరవేర్చుకోఁదగిన పరమాంత రంగుఁడగు మిత్రమైనవాఁడును స్వరూపోపాయ పురుషార్థములను దెలియఁజేసి త్యాజ్యోపాదేయ జ్ఞానమును గృపఁజేయు గురువైనవాఁడును ఇష్టానిష్ట ప్రాప్తిపరిహారములను జేయు నుపాయమైన వాఁడును నగుచున్నావు. అనన్యార్హ శేషభూతుఁడనై నిరుపాధికమగు సాత్త్విక సర్వవిధకైంకర్యములను జేయఁదగినవాఁడనై దేవరవారినే పరమప్రాప్యప్రాప కములుగాఁ దలంచి గత్యంతరశూన్యుండై యుండు దాసుఁడు నిరుపాధిక సర్వవిధబంధువగు దేవర వారికే నిర్వాహ్యుఁడ నగుచున్నందున కరణత్రయ మును దేవరవారియందే ప్రవణమైయుండునటుల శిక్షించి యేలుకొనవలయును.

అవ. మహాకులప్రసూతులై యుండియు గత్యంతరశూన్యనివలె నీకే భరింపఁదగియున్నాననుటేమని భగవదభిప్రాయముగాఁగాఁ గొప్పతిరువంశమందు జనించియు మహాపాపినైనందున నధోగతిపా లగుచున్నానని సాయించుచున్నారు:—

శ్లో. జనిత్వాహం వంశే మహతి జగతి ఖ్యాతయశసాం
శుచీనాం యుక్తానాం గుణపురుషతత్త్వస్థితివిదామ్,
నిసర్గాదేవత్వచ్చరణకమలైకాంతమనసా
మధోధః పాపాత్మా శరణద నిమజ్జామి తమసి. ౬౧

టీ. జగతి = లోకమందు, ఖ్యాతయశసాం - ఖ్యాత= ప్రసిద్ధమైన, యశసాం = ప్రభావముగలవారును, శుచీనాం= పరిశుద్ధులైనవారును నిత్యసంశ్లేషాపేక్షగలవారును, గుణపురుషతత్త్వ స్థితివిదాం - గుణపురుష = ప్రకృతిపురుషులయొక్క, తత్త్వస్థితి = స్వరూప స్వభావములను, విదాం=గుర్తెరిఁగినవారును, నిసర్గాదేవ = స్వాభావికముగానే, త్వచ్చరణకమలైకాంతమనసాం - త్వత్=దేవరవారియొక్క, చరణకమల = తామరపుష్పములవంటి శ్రీపాదములందు, ఏకాంత = అనన్యభోగ్యముగా ననుభవించుచున్న, మనసాం = హృదయములుగల మహనీయులయొక్క, మహతి = సర్వాతిశయమైన, వంశే=తిరువంశమందు, జనిత్వా = జన్మించి, పాపాత్మా = పాపస్వరూపుఁడగు నేను, తమసి=అజ్ఞానాంధకారమందు, అధోఽధః = క్రిందుక్రిందుగా, హేశరణద = సర్వరక్షకుఁడైన యోస్వామీ! నిమజ్జామి = మునిఁగిపోవుచున్నాను.

తా. లోకమందు భగవద్విషయికారరూప మహాప్రభావముచేఁ బ్రసిద్ధులై ఈశ్వరవ్యతిరిక్త విషయభోగ్యతాబుద్ధి గంధరాహిత్యరూపపారిశుద్ధ్యముగలవారై నిత్యసంశ్లేషము నెదురుచూచుచున్నవారై చిదచిత్తులస్వరూపస్వభావయాథాత్మ్యజ్ఞానముచేఁ బరిపూర్ణులై అవతరించినదిమొదలు దేవరవారి శ్రీపాదసరోజమకరందానుభవమే ధారకపోషకభోగ్యములుగాగల మహాత్ములయొక్క తిరు

వంశమందు జన్మించియు దుష్కృతములన్నియు నొకశరీరముగాఁ బరిగ్రహించినట్లు కేవలపాపస్వరూపుఁడైనందున నజ్ఞానాన్యథాజ్ఞానవిపరీతజ్ఞానములను గాఢాంధకారమునఁబడి సర్వరక్షకులగు దేవరవారిని దెలియనేరక యధోగతిపాలై మునిఁగిపోవుచున్నాను.

అవ. పూర్వశ్లోకమందు పాపాత్మక శబ్దముచే సంగ్రహింపఁబడినదై తమమహాకులీనత్వమును అసత్సమముగా జేయునట్టి స్వదోష ప్రాచుర్యమును విశదీకరించుచున్నారు:—

శ్లో. అమర్యాదఃక్షుద్రశ్చలమతిరసూయాప్రసవభూః
కృతఘ్నో దుర్మానీ స్మరపరవశో వంచనపరః,
నృశంసః పాపిష్ఠః కథమహమితో దుఃఖజలధే
రపారాదుత్తీర్ణస్తవపరిచరేయం చరణయోః.

టీ. అమర్యాదః = వేదవిహిత మర్యాదకులోఁబడనివాఁడును, క్షుద్రః=నికృష్టుఁడైనవాఁడును, చలమతిః = బుద్ధినిలకడలేనివాఁడును, అసూయాప్రసవభూః - అసూయా = గుణములందును దోషారోపణముచేయు దుర్గుణమునకు, ప్రసవభూః = ఉత్పత్తిస్థానమైనవాఁడును, కృతఘ్నః = ఉపకరించినవారికి నపకారములఁజేయువాఁడును, దుర్మానీ=తన్ను బ్రహ్మాదులకంటె నతిశయముగాఁ దలఁచుకొనువాఁడును, హేయవిషయాభిలాషచే కామపరతంత్రుఁడైనవాఁడును, వంచనపరః = దుర్విషయములకు

సాధనమగు ద్రవ్యముల నార్జించుట కితరుల వంచించువాఁడును, నృశంసః = ఘాతుకుండైనవాఁడును, పాపిష్ఠః = పాపకృత్యములం దభిరుచిగల, అహం=నేను, అపారాత్ = అంతములేని, ఇతః దుఃఖజలధేః = ఈదుఃఖసాగరమునుండి, కథం=ఏప్రకారము, ఉత్తీర్ణః = గట్టెక్కినవాఁడనై, తవ=దేవరవారియొక్క, చరణయోః = శ్రీపాదములందు, పరిచరేయం=సర్వవిధ కైంకర్యములఁ జేయుదును.

తా. వేదవిహితమర్యాదల తిరస్కరించి ప్రవర్తించువాఁడనై అట్టిప్రవర్తులచే నత్యంతనికృష్టుఁడనై దుర్విషయప్రవర్తనము నాశహేతువని భాగవతులుచేయు హితోపదేశమందును బుద్ధి నిలకడలేనివాఁడనై హితోపదేశము చేయువారియొక్క పరిపూర్ణకల్యాణ గుణములందును దోషారోపణమే చేయువాఁడనై చేవదలక సన్మార్గములందుఁ బ్రవర్తింపఁజేయ నిచ్ఛయించి సర్వవిధముల నుపకరించు వారికి నానావిధాపకారములఁ జేయుచున్న వాఁడనై ప్రభావమిట్టిదిగానున్నను బ్రహ్మాదులశిరస్సులందు వర్తించు సర్వాతిశయుఁడనుగాఁ దలఁచుకొనుచున్న వాఁడనై తలంపు ఈలాగున్నను హేయవిషయాభిలాషచే కామపరతంత్రుఁడనై కామపారతంత్ర్యముచేఁ బ్రవర్తించు విషయములందే వంచించి ద్రవ్యముల నపహరించువాఁడనై నన్ను విశ్వసించి

యుండువారలందును మిక్కిలి క్రూరముగా వర్తించు వాఁడనై ఇట్టిపాపకృత్యములం దనుతాపగంధమైనను లేక మహాభినివేశముతోఁ గాలక్షేపము చేయుదాసుఁడు ప్రత్యక్షసిద్ధమై దరి గానరానిదై యున్న దుఃఖసాగరమునుండి యేప్రకారము గట్టెక్కినవాఁడనై నిత్యముక్తులు పరిచర్య చేయు దేవర వారి శ్రీపాదములందు సర్వవిధకైంకర్యములం జేయుచు నానందింపఁజేయఁబోవుచున్నాను.

అవ. బుద్ధిపూర్వకముగా మీరుచేసియుండు దోషము లనంతములై యుండఁగా క్షమించుటఁ దగునా యని భగవదభిప్రాయముగాఁగా కాకాసురుని నపరాధమునున్ను శిశుపాలుని నపరాధమునున్ను క్షమించి యేలుకొనిన దేవరవారియొక్క క్షమాగుణమునకు దాసుని నపరాధము లెంతమాత్రమని సాయించుచున్నారు:—

శ్లో. రఘువరయదభూస్త్వం తాదృశో వాయసస్య
ప్రణతఇతి దయాళుర్యస్యచైద్యస్యకృష్ణ,
ప్రతిభవమపరాద్ధుర్ముగ్ధసాయుజ్యదోఽభూ
ర్వదకిమపదమాగస్తస్యతేస్తిక్షమాయాః. ౬౩

టీ. హేరఘువర = ఓశ్రీరామస్వామీ! తాదృశః=అట్టి మహాపరాధియగు, వాయసస్య = కాకాసురునికి, ప్రణతఇతి= నమ్రుఁడైనాఁడని, దయాళుః = కృపగలవాఁడవు, అభూరితి యత్ = ఐతివనుట యేదికలదో, హేకృష్ణ ఓకృష్ణస్వామీ!

ప్రతిభవం=ప్రతిజన్మమందును, అపరాద్ధః=అపరాధము చేయుచున్న,యస్యచైద్యస్య=ఏశిశుపాలునకు, సాయుజ్యదః = పరమపురుషార్థమును గృపచేసినవాఁడవు, అభూరితియత్=ఐతివనుటయేదిగలదో, హేముగ్ధ = అపరాధానపరాధముల వివేకింపలేనియోస్వామీ! తస్యతే = అట్టిదేవరవారియొక్క; క్షమాయాః= క్షమాగుణమునకు, అపదం = విషయముగాని, ఆగః = అపరాధము, కిమస్తి = ఏమున్నది.

తా. శరణాగతరక్షణమే పరమధర్మముగాగల దేవరవారు రఘుకులతిలకులై యవతరించినపు డపరాధము చేయుటయందుఁ బ్రీతిచే స్వతస్సిద్ధమైన దేవత్వమును వదలి తిర్యక్కులలో నత్యంతనికృష్టమగు కాకరూపమును బరిగ్రహించి భవత్పరమప్రణయినియగు పిరాట్టిని మర్మమందు బాధించి దేవరవారి తిరువుళ్లమును పుండుచేసి బ్రహ్మాస్త్రమునకు లక్ష్యమై మాతాపిత్రాదులును మహానీచుఁడని మెడఁబట్టి త్రోసివేయఁగా మూఁడులోకములందును గత్యంతరములేక యెదుటవచ్చి పడిన మహాపాపియగు కాకాసురుని నిరవధికకృపచే రక్షించినవారై యదుకులప్రదీపులై యవతరించినపుడు దేవరవారి విషయమున ప్రతిజన్మమందును మహాపరాధములఁ జేయుచు నదేజీవనముగాఁగలవాఁడై కాకాసురుని సత్పురుషుఁ డనిపించిన మహాపాపియగు శిశుపాలుని

సకలాపరాధముల క్షమించినదేగాక పరమపదము నున్ను గృపచేసిన సకలకల్యాణగుణపరిపూర్ణులగు దేవరవారియొక్క క్షమాగుణమునకు సహింపఁ గూడని దేమియు లేనందున దాసుని నపరాధ బాహుళ్యమొక విషయము గాదని భావము.

అవ. నిరంకుశస్వతంత్రులమగు మేమొకానొకవిషయ మందీలాగున జరిపిన నది సకలమైనవారియందును వైధమా యని భగవదభిప్రాయముగాఁగా నది వైధముగాకపోయినను సముద్ర తీరమం దాశ్రిత సామాన్యముగా దేవరవారు జేసియుండు ప్రతిజ్ఞ నన్నొకనివినాఁగానో యని యడుగుచున్నారు:—

శ్లో. నను ప్రపన్నస్సకృదేవనాథ
తవాహమస్మీతి చయాచమానః,
తవానుకంప్యస్స్మరతః ప్రతిజ్ఞాం
మదేకవర్జం కిమిదం వ్రతంతే. ౬౪

టీ. నను నాథ = నిరుపాధికశేషియగు స్వామీ ! తవ= దేవరవారికి, అహం= నేను, అస్మి =అనన్యార్హ శేషభూతుఁడనగు చున్నాను. ఇతి=అని, సకృదేవ = ఒకతూరే, యాచమానః = యాచించుచున్న, ప్రపన్నః = ప్రపన్నుఁడు, ప్రతిజ్ఞాం=ప్రతిజ్ఞను, స్మరతః =స్మరించుచున్న, తవ= దేవరవారికి, అనుకంప్యః= అనుగ్రహింపఁదగిన వాఁడగుచున్నాఁడు. ఇదం= ఈ, తే= దేవర వారియుక్క, వ్రతం=నియమము, మదేకవర్జం కిం= నేనొకఁడు వినాగానాయేమి.

తా. దక్షిణసముద్రతీరంబున విభీషణుల ననుగ్రహించు కాలమందు [1]దేవరవారికి ననన్యార్హశేష భూతుఁడ నని యాశ్రయించిన చేతనుని సర్వభూతములవలననుండి రక్షించి పరమపురుషార్థ కైంకర్యసిద్ధి పర్యంతములగు సకలఫలములఁగృపఁ జేసి యేలుకొనియెద నని యాశ్రితజనసాధారణముగా దేవరవారు చేసియుండు ప్రతిజ్ఞకు "త్వత్పాదమూలం శరణం ప్రపద్యే" యని ప్రపత్తిచేసియుండు దాసుఁడు లోఁబడినవాఁడనుగానా, లేక పలాని శ్రీయాళవందారు వినాగా మిగిలిన వారెవరైన నాశ్రయించిరేని కాపాడెదను వారినిమట్టుకు రక్షించుటలేదని నిశ్చయించుకున్న దేమైనను కలదా అట్లు లేనందున దేవరవారి సత్యసంకల్పంబునకు హానిరాకుండుటకై యవశ్యము రక్షింపవలయును.

అవ. దేవరవారు సత్యసంకల్పత్వ హానికొప్పుకొనినను శ్రీమన్నారాయణునితోఁగలిగియుండు మంత్రసంబంధ దేహసంబంధములఁ గటాక్షించి దాసునివృత్తి నాలోచింపక యనుగ్రహింపవలయునని విన్నపము సేయఁగా దానికి మాఱుచెప్పుటకు వల్లలేనందున నాలాగే యనుగ్రహించెదమని యాళ్వారుఁ

1. "సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే, అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ."

డనుమతించేయఁగా స్వాభిమతము లభించినవారై స్తోత్రమును ముగించుచున్నారు:—

శ్లో. అకృత్రిమత్వచ్చరణారవిన్ద
ప్రేమప్రకర్షావధిమాత్మవన్తమ్,
పితామహం నాథమునిం విలోక్య
ప్రసీదమద్వృత్తమచిన్తయిత్వా. ౬౫

టీ. అకృత్రిమత్వచ్చరణారవిన్ద ప్రేమప్రకర్షావధిం - అకృత్రిమ = స్వాభావికమైన, త్వత్ = దేవరవారియొక్క, చరణారవింద = తామరపుష్పములవంటి శ్రీపాదములయందలి, ప్రేమప్రకర్ష = ప్రేమాధిక్యమునకు, అవధిం = సీమాభూమియైన వారును, ఆత్మవన్తం = ఆత్మయాథాత్మ్యజ్ఞానముగల, పితామహం = తాతగారైన, నాథమునిం = శ్రీమన్నాథమునులను, విలోక్య = కటాక్షించి, మద్వృత్తం = నావృత్తిని, అచిన్తయిత్వా=తలంపక, ప్రసీద=అనుగ్రహింపుము.

తా. తరుణరవికిరణ వికసిత మనోహర సరోరుహ సుందరంబులగు ప్రాప్తశేషియగు దేవరవారి శ్రీపాదములందుఁ బరిమళంబుతో నంకురించు తిరుత్తుళాయివలె నవతారసిద్ధమైన పరమభక్తిగలవారై యచిద్వత్పారతంత్ర్యరూపాత్మయాథాత్మ్యజ్ఞానపరిపూర్ణులై శ్రీరంగనాథులను తిరునామముగలవారై దేవరవారి కత్యంతాభిమతులై యాత్మసంబంధ

దేహసంబంధములచే దాసునికి తాతగారైన శ్రీమన్నాథమునులఁ గటాక్షించి దాసుని సద్వృత్తి దుర్వృత్తుల నాలోచింపక యనుగ్రహించి రక్షింపవలయును.

శ్రీయాళవందారుస్తోత్రము సంపూర్ణము.





చెన్నపురి : 'శ్రీరామా' ప్రెస్సున ముద్రితము.—1935.

# స్తోత్రములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| కనకధారాస్తవము, ఆంధ్రతాత్పర్యసహితము | 0 | 2 |
| కృష్ణకర్ణామృతము, ఆంధ్రటీకాపద్యతాత్పర్యసహితము | 1 | 8 |
| శ్రీకృష్ణలీలాతరంగిణి, ఆంధ్ర తాత్పర్యవివరణసహితము | 1 | 8 |
| శ్రీగుణరత్నకోశము, ఆంధ్రటీకాతాత్పర్యవిశేషార్థస॥ | 0 | 4 |
| తులసీస్తోత్రకదంబము ... | 0 | 3 |
| నవగ్రహస్తోత్రము, చిన్నసైజు ... | 0 | 4 |
| ప్రాతఃస్మరణ, ఆంధ్రతాత్పర్యసహితము ... | 0 | 2 |
| భజగోవిందము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | 0 | 2 |
| సహస్రనామకదంబము— విష్ణుసహస్రనామస్తోత్రము, నామావళి, కృష్ణాష్టోత్తరము, రామాష్టోత్తరసు, నామావళీ, లక్ష్మీనృసింహస్తోత్రము, లక్ష్మీఅష్టోత్తరము, గజేంద్రమోక్షము, కృష్ణాష్టకము, కృష్ణద్వాదశనామస్తోత్రము, అష్టోత్తరశతము, శ్రీస్తుతి, ఆదిత్యహృదయము, నారాయణకవచము, శ్రీ హయగ్రీవసహస్రనామస్తోత్రము, అష్టోత్తరశతము, హయగ్రీవకవచము, ఆంజనేయఅష్టోత్తరశతము, గోపాలసహస్రనామస్తోత్రము మొదలగు 25 అంశము లిందుగలవు. చిన్నసైజున చక్కగా ముద్రింపఁబడి కాలికోబైండు చేయఁబడియున్నది. ... | 0 | 12 |

| ప్రతి 1-కి | రు. | అ. |
|---|---|---|
| ముకుందమాల, సాంధ్ర తాత్పర్యము ... | 0 | 4 |
| రామబ్రహ్మమానసికపూజ, చిన్నసైజు ... | 0 | 1 |
| రామకర్ణామృతము, ఆంధ్ర పద్యతాత్పర్యసహితము | 1 | 8 |
| లక్ష్మీనృసింహస్తోత్రము, ఆంధ్ర తాత్పర్యసహితము | 0 | 2 |
| లక్ష్మీస్తోత్రరత్నత్రయము ,, ... | 0 | 12 |
| లక్ష్మీహృదయము, నారాయణహృదయము ... | 0 | 3 |

## సహస్రనామములు :—

| | | |
|---|---|---|
| ఆంజనేయసహస్రనామము ,, ... | 0 | 3 |
| కృష్ణసహస్రనామము ,, ... | 0 | 3 |
| గోపాలసహస్రనామము ,, ... | 0 | 3 |
| పురుషోత్తమసహస్రనామము ,, ... | 0 | 4 |
| రామసహస్రనామము ,, ... | 0 | 4 |
| లక్ష్మీసహస్రనామము ,, ... | 0 | 3 |
| లక్ష్మీనృసింహసహస్రనామము ,, ... | 0 | 4 |
| సీతాసహస్రనామము ,, ... | 0 | 4 |
| విష్ణుసహస్రనామస్తోత్రము, నామావళీ, రామ, కృష్ణ, లక్ష్మీ అష్టోత్తరసహితము, చిన్నసైజు | 0 | 4 |
| విష్ణుసహస్రనామము, శంకరభాష్యాంధ్రటీకాతా॥ | 2 | 0 |
| వేంకటేశసహస్రనామము, నామావళీసహితము, చిన్నసైజు ... | 0 | 3 |

## వేదాంతగ్రంథములు.

| | | |
|---|---|---|
| ఆత్మానాత్మవివేకము ... | 1 | 4 |
| అష్టోత్తరశతోపనిషత్తులు, మూలము ... | 6 | 0 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఉత్తరగీతా, సటీక, చిన్నసైజు ... | 0 | 12 |
| బ్రహ్మసూత్రములు, మూలము ... | 0 | 3 |
| భగవద్గీతాసారసంకీర్తనలు ... | 0 | 2 |
| భగవద్గీతలు, మూలముమాత్రము ... | 0 | 4 |
| ,, కాలికోబైండు ... | 0 | 6 |
| ,, ఆంధ్రతాత్పర్యసహితము, కాలికో | 1 | 4 |
| ,, ,, చిన్నసైజు ... | 0 | 8 |
| ,, ఆనిబిసెంటుగారి ఇంగ్లీషుతర్జుమా | 0 | 8 |
| ,, శ్రీరామచంద్ర సరస్వతీకృత ఆంధ్ర టీకాతాత్పర్యసహితము ... | 2 | 12 |
| భగవద్గీత, ద్వైతమతానుసారమైన వివరణము | 1 | 0 |
| అద్వైతసంగ్రహము, తెనుఁగువచనము ... | 0 | 2 |
| ఆత్మబోధము, సాంధ్రటీక ... | 0 | 4 |
| ఆనందలహరి, ఆంధ్రతాత్పర్యసహితము ... | 0 | 4 |
| అపరోక్షానుభూతి ,, ... | 0 | 4 |
| అద్వైతోపదేశపంచరత్నములు,, ... | 0 | 2 |
| ఆత్మపూజ, ఆంధ్రతాత్పర్యసహితము ... | 0 | 1 |
| ఆత్మవిద్యావిలాసము ... | 0 | 6 |
| అద్వైతవేదాంతపరిభాష, సవ్యాఖ్యానము ... | 1 | 4 |
| అద్వైతానుభూతి, ఆంధ్రతాత్పర్యసహితము | 0 | 2 |

ఇవిమొదలగు సంస్కృతాంధ్రగ్రంథములు అనేకములు మాయొద్ద దొరకును.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,